ములతో నర్థనిరూపణము గావించినఁ గావింపవచ్చును గాని ధాతువులకే గ్రామ్యరూపముల నుదాహరించుట వానియర్థమును సంస్కృతమున నాంధ్రమున ను దెల్పుటయును శ్రీసూరిగారివంటి యభినివిష్టు లాచరింతురా? "ధాత్వాదులకు ధాత్వాదు లనుప్రయుక్తంబులై వితణార్థాభిధాయకంబు లగు నయ్యవి శబ్దపల్లవంబులు నాఁబడును." అని సూత్రించి సూరిగారు ఏగుదెంచు, చనుదెంచు, మేలుకొను, అందిమ్ము, చొత్తెంచు మొదలగురూపములను సాధించిరి. వీనియం దవయవద్వయము వేర్వేఱ స్వతంత్రప్రయోగము గలదియే. ఈగ్రంథమునందు అగపడు మొదలగురూపములను సమానధాతువులుగాఁ జేర్కొని అగపడులో అగకు వ్యస్తప్రయోగము లేదనుట సూరిగారిమతమునకు విరుద్ధముగాదా? సమానధాతుసంజ్ఞ సూరిగారిగ్రంథమునం దెక్కడ నగపడదు. సమానధాతువు లను సంజ్ఞాకరణమే దుష్టము. ప్రయోగారూఢములగుదేశ్యధాతువులకు మాత్ర మర్థనిరూపణము రూపనిష్పత్తియుఁ గావించుట గ్రంథోద్దేశమయి యుండఁగా నిందు వ్యావహారికములఁగూడ నుదాహరించియుండుఁ గొన్నింటికి మాత్రము గ్రామ్యము లని "గ్రా" సంజ్ఞతో సూచన గావింపఁబడినది. సూచనావిరహితము లయ్యు గ్రామ్యము లనేకములు గలవు. మఱియు ననేకవిధము లగుదోషము లీగ్రంథమునం దగపడుచున్నవి. వాని నీషన్మాత్రముగ నీసారిది నుదాహరింతును.

అగపడు, అగుపడు- ఆమతించు, ఆమెతించు- ఎదగు, ఎదుగు- ఎదిర్చు, ఎదిఱ్చు, ఎదిఱించు, ఎదుఱ్కొను- ఓదార్చు, ఓదర్చు- తడవు,తడువు, తవుడు- తవుడుకాడు, మొద లగురూపాంతరము లడుగడుగునఁ జూపఁబడినవి. కాని యిందలిరూపాంతరములును శకటరేఫసంయోగములును గ్రంథములం దెక్కడను గానరావు, కొన్ని వ్యవహారమందును మృగ్యములే. ఓటించు-ఓట్రించు; కతకు-కతుకు, కదకు-కదుకు, తవుడు-తవుడుకాడు, మట్టగించు, మద్దటిలు-మద్దటిలు, లోటు, లోడు అను రూపాంతరములే ఏదేశమం దేవి వ్యవహారసిద్ధములో నాయెఱిఁగినంతవఱకుఁ దెలియరాలేదు.

అర్థనిర్ణయమునందు ననేకదోషము లున్నవి. ఆమెతించు-సత్కారపూర్వకముగాఁ బిలుచుట, విందుచేయుట యగునేమో! క్రచ్=కాంక్షించుట.(చుట్టుకొనుట శ. ర) ఆవు మొదలగునవి పొడుచుట క్రుమ్ము కాని కుమ్ముకాదు. దుయ్యానకు బాణము దూసిపాఱుట కాని పిడికిలినుండి జాఱుట కాదు. ఒకవేళ

పిడికిటనుండి విడుచుట యగునేమో ? కరకు మొదలగు నాల్గురూపములకు భోజనసామాన్యమే యర్థమైనను శునకాస్వాదనమే యని నియమించుట సరి కాదు. రాపాడు దోషమారోపించి తెల్పుటంట ? వందివేయుటకు కల్పించుట ప్రసిద్ధము. ద్రవపదార్థ మొలికించుట గ్రాహ్యము. ప్రకృతిప్రత్యయ నిరూపణమందును దోషము లగపడుచున్నవి. అదు-అలిచేరితోఁ గొట్టుట యను చు వర్తమానార్థక ప్రత్యయము వని తెలుపుట తప్పుగాదా ? కొడుగలమునో కొడుగల ధాతువంట, చు వర్తమానార్థక ప్రత్యయ మంట. ఇంతటి వైపరీత్య మొందైనఁ గలదా ?

వ్రాఁతప్రతియందు ధాతువు, సంస్కృతార్థము, ఆంధ్రార్థము, వర్తమాన భూతభావికాలిక ప్రత్యయములు, విశేషములు నని యేనువిభాగములు ప్రదర్శింపఁబడినను, ముద్రణమున ధాతుధాత్వర్థములు మాత్రమే ప్రకటింపఁబడినవి. అన్నిధాతువులకు వర్తమానమున చువర్ణకమును భూతమున ఇత్-ఇస్ వర్ణకములును, భావిని ఎద్, ద్ వర్ణకములును చెప్పఁబడినవి. విశేషములందు సమానధాతువులు, శాస్త్రీయములు, అస్వతంత్రములు మొదలగువిషయములు పేర్కొనఁబడినవి. అన్నింటికిని జివర దము ప్రత్యయము తో నర్థము నిరూపింపఁబడినది.

పైయంశము లన్నింటి నాలోచించినచో బరిషత్తువారు ప్రకటించినది చిన్నయసూరికృతమేనా యనుసంశయము గలుగుట సహజము. చిన్నయసూరివంటి లాక్షణికశిరోమణి గ్రంథమం దిట్టిదోసఁగులు పొసంగునా యను శంక దుర్నివారమే యైనను గొంచె మాలోచింపఁదగును. శ్రీసూరిగారు ధాతుమాల నొకదానిని రచించి రనుటలో నెట్టిసంశయమును లేదు. చెన్నపురిప్రాచ్యలిఖితపుస్తకాగారమున నొకధాతుమాల చిన్నయసూరివిరచిత మగునది యుండెడిది. ఆపుస్తకము నెవ్వరో యపహరించినను దానివరుససంఖ్యయఁ జేరును నిప్పటికిని గలదు. పరిషత్తునకు లభించినప్రతి శ్రీసూరిగారి స్వహస్తలిఖితము కాదు. వారిప్రతికిఁ బుత్రికయో పౌత్రియో యింకనువ్యవహిత సంతతియో తెలియదు. ప్రతులఁ జూచి పుత్రికల వ్రాసికొన్నవారు తప్పుల దొరలించుట వింత కాదుగదా! శ్రీసూరిగారిగ్రంథములు చాల నీనడుమఁ బరిషత్తువారికి లభించినవి. వానినెల్లఁ జూచిన నీవిషయము సత్యమే యని తేలును. లోకములో వ్రాఁతతప్పులు పడుట సైజమే కాని ప్రక్షిప్తము లధికము

గాఁ దూఁటుట శ్రీసూరిగారి గ్రంథములకు సంభవించిన మహోపద్రవము. వారియందు గౌరవాతిశయమునఁ దమ రేమో సాధించితి మనుతలంపున మంచిచెడ్డలారయక యడ్డమైనగడ్డి నెల్ల గ్రంథమందుఁ జొప్పించుట శ్రీసూరిగారి గ్రంథములం దధికముగా నగపడును. అట్టిచేరికలు లేకున్న నీధాతుమాల కెంతటిగౌరవము నొందెడిదో ! ఇదియే కాక శ్రీసూరిగారి గ్రంథము లముద్రితము లేవియైనను మనకు నిర్దుష్టముగ లభించుట దుష్కరమే. ఎట్లయినను నేను బ్రారంభమునఁ జెప్పినంత యుపయోగ మిప్పటియీ గ్రంథమునకు లేకున్నను దీనియవసరము గలదనియే నావిశ్వాసము. గ్రామ్యములో గ్రాంథికములో యగుధాతువుల నొక్కచోఁ జేర్చి వానియర్థము నిరూపించుట వ్యుత్పిత్సువుల కత్యంతోపకారకముగదా ? అందును గ్రామ్యరూపముల వలన భిన్నదేశవ్యవహారము సుగమ మగును. కావున నీధాతుమాలను బ్రకటించి యాంధ్రసాహిత్యపరిషత్తు మహోపకార మొనరించె ననుట కావంతయు సందేహము లేదు.

నరసన్నపేట, గంజాము.
20-1-1930

కత్తి సాంబమూర్తిశాస్త్రి.

ఉ. పాటలగంధితోడ హరి పానుపునందు వసించునత్తఱిం
బాటలగంధు లింపడరఁ బాడఁ బాటలు నవ్వులాటలన్
మాటికిఁ గేలుదప్ప కెడమం గుడి దుఃఖ్వాడుమారునంటపూ
ఝాటపునీటు లెన్న నెకసక్కెపుమాటలు మీఱెఁ గార్యమున్. ౧౪౨

— శ్రీకృష్ణునకుఁ దాంబూల మిచ్చుట —

క. ఆమెడఁ బదినూఱులబలు, చాయలుగలవేల్పుతేఁడు సన్నగునంగం
జాయన్ మరుండు దమ్ముల, మాయదఁ భర్తకు నొసంగునభిరతి వచ్చెన్.

ఉ. వేయగుపాదముల్ గలిగి విశ్రుతదీధమహామంబు గాంచఁగా
చాయపొలంతితేఁ డలసినంతతివై తగునీకు నెక్కుడం
బాయవు మాంద్యకంగుతలు భానుజాతండ్రికి వీడ్య మిచ్చు డే
చాయ నొసంగె దంచు హరిసాత్యకిముఖ్యులు నవ్వుచుండఁగన్. ౧౪౪

గీ. మాంద్యకంగుతలన్నచో మానుఁ జర్వ, నమునఁ బచ్చటనువష్టిఁ జానుమీఱు
ననుచు నవ్వుచు నుత్తరం బాడికొనుచు, హరికి నసితుండు వీడియంబమరనిచ్చె.

ఉ. తెలివి దలిర్ప నా కబలిఁ దీరఁగఁ గృష్ణుఁడు దివ్యరత్నముం
దెలిబలుప్రాను మోముకి జితేటలుగల్గిన గిడ్డి నీగికి
న్వాలయుఁగఁ బంచి తద్ఘ(టి)తః స్రుతనవ్వయ భేష్టవస్తునం
కలన సమస్తలోకముల గారవ మొప్పఁగఁ దన్ని పంపుడున్. ౧౪౬

— అప్పగింతలు —

క. అంతట నంతటిచుట్టం, బంతఃకిరణం బపారగానందపయో
ధ్యంతరముననోలాడఁగ, నంతికి చరుఁడొచుఁ గూర్మి నల్లునిఁబలికెన్. ౧౪౭

ఉ. ఎల్లజగంబు లేలుపరమేశ్వర భక్తజనావనార్థమై
యిల్లలితంపుమానవసమీహితచేష్టలు గాంచుసామి నీ
పల్లుఁడవైతి గానఁ జరమాద్రికి నవ్వలఁ జిమ్మచీఁకటుల్
ద్రొల్లఁగఁ జేయునట్టిడిపటుత్వము గాంచుప్రభల్ భరించితిన్. ౧౪౮

గీ. ఎంతకాలంబునుండియో మొదయకుండు
పటుతమోగ్రస్తత హరింపఁ బాలుపడితి
నస్తమయశూన్యమైనట్టి యభ్యుదయముఁ
జెందఁగాంచితి నయ్య ముకుంద నేను. ౧౪౯

గీ. హారణ మొసఁగుట మామకు నర్హమౌచట, సఖలకర్తకు నీఁదగునట్టి దెద్ది
యయిన సర్వస్వసందర్శనానుకూల,దక్షిణాలోకధర మిచ్చుతలఁపు నాది.

క. హరిదశ్వుఁడు హరి నీగతి, సరసచతురవచనరచన సమ్మోదితుఁగాఁ
గర మొనరింపుచు నానతి, పరమపురుషు చేతఁ గొనుము బలికెం గూఁతున్.

ఉ. ఓమదగణ్యపుణ్యవిభవోదయపూర్ణఫలస్వరూపపు
శ్రీమణి నీకతంబున గరిష్ఠగుణాంబుధి కృష్ణుఁ డల్లుఁడై
నామదిపూర్ణకామత ననంతసుఖం బగునట్లు సేసె నిం
కేమివిచార మీహిత మహీనతఁ జేకుఱె నీకు సుందరీ. ౧౫౪

గీ. భాగ్యసౌందర్యశీలానపత్నివైన, చాన నీకు సపత్నులు చాలఁ గలరు
వారిమదిలోనవిక్రియోత్పత్తిగగన,కుసుమసాదృశ్యమొందింపఁగోరవమ్మ.

గీ. అంబుజాక్షి సర్వకార్యంబులందు, ననుసరింపుము హరిజాయననుసరించి
హరికథానుగతిస్ఫూర్తి నలరనీకుఁ, దల్లియగుఛాయఁ బోలంగఁ దల్లి మేలు

గీ. పగలుఁగావించి మాయమ్మ పగలు సేయు, వాని బిడ్డన నడచుట వాసిగాదు
మాకు వన్నెగ నంతటమైత్రి పూని, భువనబాంధవసుత యనబుద్ధిగనుము ౧౫౫

శా. అమ్మా మమ్ముఁడఁబాసితెంచు మదిలో నావంత యైన న్విచా
ర మ్మూనం బనిలేదు కాంతలకు నబ్రమ్మే యదెన్నంగ నై
న మ్మానన్ భవదీయసన్నిధి జగన్నాథుండు నన్నుం గృపన్
సమ్మానింపుచుఁ బాయఁ డెప్పుడు నిజస్వారాక్షిగాఁ జూచుచున్. ౧౫౬

చ. సిరికి నివాసమైన హరిచెట్ట గ్రహించిననీకు లక్ష్యమే
హరణముగాఁగ నే నొసఁగునర్థము లైనను దండ్రిపట్టికిన్
హరణమొసంగు టిజ్జగము లాగమముల్ దగఁ దెల్పు నింతె కా
దరయ బితృస్వకాంక్ష ధృఢమై మదిఁబుట్టెడు నట్టిపోటికిన్. ౧౫౭

ఉ. కావున సర్వవస్తువులు గల్గుటకై సకలోపచారస
ద్భావముకై ద్యులోకతిరుబంధురధేనుచిరత్నరత్నముల్
భావము పొంగ నిత్తుఁ గొను భాగ్యవతీతిలకంబ వాని నీ
భావములో స్మరింపఁ గనునట్టి ఘటింపఁగ నానతిచ్చెదన్. ౧౫౮

క. అని ఛాయతోడఁ గూరిమి, తనయామణి గారవించి తరకేతుణచే
వనజాప్తు డొకవిధంబున, ననుమతి గైకొనుచు నొందె నాత్మాలయమున్.

క. కుహనారాజకుమారక, మహనీయగుణాభిరామ మైథిలకన్యా
పహరణపరఖరదూషణ, సహజావైరూప్యకరణ సత్యాభరణా. ౧౬౦

గద్యము.

ఇది శ్రీరామచంద్రచరణారవిందమిళిందాంతఃకరణ పోలూరి మాధవయజ్వ
సముజ్జ్వలత్కృపోత్థిత కటాక్షాసాదిత పాండిత్యాభరణ ప్రభంజనవం
శాబ్ధిరాకాశశాంక నిరంతరారాధితవిచక్షణశశాంక అభినవ
సన్నయభట్టారక అహోబలపత్యాఖ్యాయకవిమనో
పాధ్యాయభట్టారకప్రణీతం బైన కాళిందీకన్యా
పరిణయం బనుమహాప్రబంధమునందు
పంచమాశ్వాసము.

---

చ. చెలులయభిప్రాయజ్ఞమె(గఁ)జిహ్మముఁ గమ్మనివింటివానిపూ
ములుకుల *క్రొవ్వడంపుఁచు(ను) ముప్పిరిఁగొన్ననురాగగర్వమున్
నిలువ(వ)దల్చుచుం జెలువ నిల్చెను నొక్కఁడు గొక్క కుండ నిం
తలు భళిరా భళీర మదిఁ దాల్గొనుసిగ్గుకటుత్వవైఖరుల్. ౧౧

సీ. మదనుఁ డను కర్ణధారుండు గదియునేని, పెనిమిటుడి యనువావ శోభిల్లునేని
నేకరంబులనరదారబిడ్డయేని, చెలువ దాఁటంగలేదమ్మ సిగ్గుకడలి. ౧౨

చ. వెనుకకు సిగ్గులాగఁ దమినేకము ముందఱి కీగ్గ నవ్వ్యథం
జనున సహింప †భావము ముసాధిలుమధ్య మభావ మైనచో
ఘనకుచ‡భారధారణము గాఁ జన దంచు వదింపవచ్చునే
ఘనపదమాశ్రయించి కలకాలము §యుండెడివాని గానమే. ౧౩

క. వెడవింటిజోదు విరివి, లుగ్గుమనువసం జేయఁజేయ గురుకుచ కొక్కా
క్కొను గామదకుం గడచిన,గడుదూరం బయ్యె లజ్జగరిమం బెంతో. ౧౪

చ. అలవలరాజు పైదలి రమాధిపు(కజ్జకు) వేగఁ (1)జేర్పఁగా
వలనుదలిర్ప నూఱటలఁ బాయుచు గుప్పెడుఁ బువ్వబాణముల్
చలనములేనిమూర్తి నవస్థం బియి మించినలజ్జ జాయగాఁ
గలఁగుచు మోము వాంచెఁ గడుఁ గ్రమ్మనుసిగ్గున సిగ్గులాఁడి (2)తాన్ ౧౫

చ. చెలి తలవాంచి తెల్పె బలుచెల్వపుఁ గ్రొమ్ముడిఁ జిమ్ముచీఁకటిం
గలసి మెలంగు పావటహో కాటపుఁ జెంద్రపురేఖచే మనో
మిళదనురాగవైభవము మించఁగఁజాలదు లజ్జ నెమ్మెయిం
గలుగఁగ నేర్చు సత్వరితగామిత యంఘ్రుల కెన్నడం బొగిన్. ౧౬

వ. అప్పుడొక్క చెలికలువకంటి యక్కలికి నుద్దేశించి (యి ట్లనియె.) ౧౭

ఉ. క్రొత్తగఁ బ్రాణనాయకునిఁ గూడఁగనేగెదు వన్నెలాఁడికిం
గ్రొత్తయె లజ్జ లోఁగొనుట కూర్మిచెలుల్ గడితేర్ప జేనికిం
జిత్తము రంజిలంగఁ దగఁజేయుట యిట్టి విచిత్రలజ్జ మే
మెత్తటినైన విన్నయదియే కను చెక్కడిమాట యుగ్మలీ. ౧౮

వ. మఱియు నొక్కయింతి యక్కాంత కిట్లనియె. ౧౯

క. ఇటువంటి ముద్దరాండ్రే, కటుకరకుచకుంభవజ్రకంజరసీమన్
ఘటియింతురు నిజలీలల, నిటునటుఁ జననీక జీవితేశ్వరశుకమున్. ౨౦

(*) క్రొవ్వ- † భావము- ‡ భావధారణ- §వండెడి. (1) తెప్పగా- (2)తోన్

వ. వెండియు నొక్క తేటచెక్కులాఁడి యచ్చచక్కనికొమ్మ కిట్లనియె. ౨౧

క. నను వైనపూలపాన్పున, మనసూఱుచు నున్నవాఁడు మాధవుఁ డయ్యో
తనువునఁ గల్గుమృదుత్వము, మనమున నీ కెట్లులేదు మంజులవాణీ. ౨౨

వ. పిదప నొక్క బింబాధర యయ్యిందుబింబాస్య కిట్లనియె. ౨౩

క. హరిఁ గూడక క్షణమైనం, దరియింపఁగరాదు మేనఁ బ్రాణము లనుచున్
విరిసెజ్జఁ బొరలు నన్నును, దరియా(నక) యిట్టిలజ్జ దా నెటువనునో. ౨౪

వ. మఱియు నొక్క ప్రౌఢ యచ్చేడియకంటి కిట్లనియె ౨౫

ఉ. అక్కరొ నీవు నీమగని(యందపు)మోమ్మున లచ్చిరీతి నీ
వొక్కలఁ గుక్కుచుం దదధరోష్ఠసుధారస మానుచున్నఁ గెం
పొప్పుచు నీకు మోవి దశనోదితరాగ మతండు నీకుఁగాఁ
దప్పితి వంచు మాటికి నదల్పఁగ సిగ్గది యెందుఁ బోవునో. ౨౬

వ. అంత నొక్క నిక్కులాఁడి యచ్చక్కఁదనాలబొమ్మ కిట్లనియె. ౨౭

మ. తెఱలజ్జాధర*కవ్వారంబునను రాగోద్వృత్తి కీ వేల దా
పరముం జేసెదు మర్మముం దెలియు మాపజ్జన్ వృథా గాదె యొ
వ్వరికైనం గనఁ జేటఁ జెందు మదిలోఁ బాటిల్లురాగంబు శ్రీ
కరవక్త్రాంబుజరాగనామకమహాకర్ణేజపం బంచుటన్. ౨౮

వ. అనంతరంబ యొక్క పృథునితంబ యాకాదంబగమన కిట్లనియె. ౨౯

ఉ. ఇంతచలంబు సేయ ఫల మే మని చెప్పినఁ గాఁక సేసె దో
కాంతరొ కట్టివాయి యని కాంతుని నెమ్మదిఁ దోఁచునమ్మ శ్రీ
కాంతుని కెందలో కలరు కాంతలు వారలకెల్ల మిన్నవై
కాంతమనోనురంజనముగా సుగుణంబుల వన్నెకెక్కవే. ౩౦

వ. తరువాత నొక్క యుగ్మలి యక్కోమలి కిట్లనియె. ౩౧

క. అతినిబిడలజ్జ గా దిది, సతికిన్ మదిలోన నవిక సంగమవేళన్
కృతములకుఁ బ్రతికృతంబుల, నితరవ్యాపార మెడసి యున్నఁగఁ జొచ్చెన్.

ఉ. అత్తఱి నీలవేణి నగ†వాఁగుచు నచ్చెలులన్ నడించి యో
చిత్తజుమల్లి కల్లి విను చిత్తము నిల్పుచు నాదువిన్నపం
బిత్తఱి నాలసింపవల దెంతయుఁ బ్రొద్దు ఘనంగఁ జొచ్చె న
య్యుత్తమనాయకుం గదియ నొప్పుగ నెంతయు నంచుఁ బల్కఁగన్.

---

* కవ్వారము=సెపము. † వాపుచు.

మ. లలనామన్మథ*మూర్ఛదృష్టి విలసద్రాగావగావేగసం
†కలనాదీవ్యదవత్రపాధుని నెమర్గా ‡నీఁ దిత్రబ్భ్రాంతిచేఁ
బలెఁ గ్రొంజెమ్మట గ్రమ్మ మొల్లన రమాప్రాణేశశయ్యాంతిక
స్థలజాగ్రద్ద్విపిజాధినాయకమణిస్తంభంబు నందం గొనన్. ౩౪

క. కేళీవేళల శ్రీహరి, నీలాగున నాఁ గౌఁగిలింతు నే ననుక్రియ న
శ్చాలిక కౌఁగిటఁ జేర్చెను, నీలస్తంభంబు సిగ్గునరయం గ్రమ్మఁగా. ౩౫

వ. అంత నక్కాంతం గడచి సఖీజనంబు సవినయభక్తిపూర్వకంబుగా మ్రొక్కి
ముందట నిలిచిన నీలవేణీనీలవేణి నీక్షించి జలజాక్షుండు నికటస్థలవిలసదు
గ్రకరనందనాసుందరేందు రేఖావిలాసన ముల్లాసబలప్రబ(ల)విభవదంతరా
మోదజలధిఫేనాయమానం బగుమందస్మితంబు ముఖాంబుజహంబు నలం
కరింప ని ట్లనియె. ౩౬

క. చలి వార్తలేమి? దేవర, కలిగినభాగ్యమున మనసు కడురంజిల్లన్
జలజాతనయన మిముఁగన, వలయుచు వచ్చుటయకాని వార్తలు గలవే.

క. అలికుంతల తుణదాముఖ, మలులితతిమిరంబు గ్రమ్మె నదియేమి? హరీ
తెలివిఁగొను కృష్ణపక్షము, వలగొను నీతుణదముఖము వదలు నెతమమున్.

వ. ఇట్లు సాభిప్రాయంబుగాఁ దనచతురోక్తికిం దగినయుత్తరం బొసంగు నాతు
రంగనయనప్రౌఢిమకు ముదంబుఁ జెంది నందకపాణి పాణివలయాదిభూష
ణపూర్వకంబుగా నభినవాంబరతాంబూలంబు లందఁజేసి నిడి వెడలి చను
నంజ్ఞ నవతరింపం జేయఁ జాయపట్టికి నీచుట్టఁబట్టినదొర పంపుపెట్టినపను
లకుం జనియెద మమ్మరో తిరిగి వచ్చెద మిచ్చట నుండు మని మరుంగుగాఁ
బల్కి యచ్చిలుకలకొలుకు లోక్కింత వెడల ననంతరంబ— ౩౮

మ. చతురోక్తి ప్రవిలాసవైఖరుల నంచద్భావ్యాలు నర్తిల్ల ల
జ్జితనంవిస్మితకాంతమ ఖ్యలలితశ్రీవీక్షణాలీసితా
సితవంకేరుహమాలికన్ మదనకాంక్షేయప్రభాపాళికన్
సితనీరేజదళాక్షి తేని కొనఁగెన్ సేవార్థమా కానుకన్. ౪౦

ఉ. కామిత మేమియు న్మనసు గాంచనియట్టియవాప్తకాముఁ ద
క్కాముని తండ్రిఁ గాముని-చొకాటపుఁబాణము భామ చూచు చెం

* యత్న † కలనంధిర్యపదత్రపా. ‡ నిందితభ్రాంతి.

తే మదిఁబుట్టువీరుని యుదీర్ణపరాక్రమ మెచ్చ నిచ్చెఁ బో
రామికి సూను చెంగటఁ బరాజయ మొందుట నీతియేకదా. ౪౧

క. హృదయగ్రంధి(వి)భేదము, మొదలంటఁగఁ జేయుబోధమూర్తికి నపుడా
మదవతిహస్తగ్రంధిక, వదలించు టతిప్రయాసవాసిత మయ్యెన్. ౪౨

చ. కరమణికంకణధ్వనులు కామధనుర్గుణనిక్వణంబుతోఁ
గరము ఘటిల్లఁ గేల్మడి నొకానొకయత్నమున న్వదల్చి శ్రీ
హరి హరిమధ్య నంకతల మందు నొనర్పఁగఁ గాంత రాజిలెన్
హరిమణినీలవేదిఁ దొలఁకారెడు పుత్తడిబొమ్మయో యనన్. ౪౩

క. చెలికీలుగంట ములగెడు, నలివాత్సువిమ్ముకులపాణినఖరుచిరాజుల్
కిలకిలనవ్వఁదొడంగెం, బొలుపూరెడు మేల్మిపయిఁడిపువ్వులనరుణన్. ౪౪

వ. అప్పు డప్పురుషోత్తముండు మదనలీలారహస్యప్రతిపాదకకృతులగుకృతుల
నిరర్థకతాదోషంబు నిజానుష్ఠానమహిమంబున నడపయింప నవధరించి
యిమ్మించుఁబోఁడి కిట్లనియె. ౪౫

ఉ. కన్నది కన్నకంతు మఱి కన్నకఁ దండపు నీదు మోముచె
న్నెన్నఁగఁ గొన్న దీదృశదృగీహితవై యలరారు టబ్రమే
సన్నుతగాత్రి నిన్నఖిలసద్గుణసంపద ముజ్జగంబులో
నన్నులమిన్న యంచు విబుధాళి ముదంబున నోలలాడఁగన్. ౪౬

గీ. మానవతి నీవు శృంగారమయత రసిక, చిత్తమెంతయు నలరఁజేసెదవు గాన
నీకలంకార్యత ఘటింపనేర రెట్లు, భాసురైకావళీముఖాభరణగణము.

గీ. భూషణంబంగితభరించెభూష్యమగుట, భూషణతఁగాంచియంగతభూనవగును
అర్హములు భావశబలతాద్యములు వాని, కాంతరచియింప వేయలంకారములుగ.

ఉ. నేరుపుమీఱఁ గన్నుఁగవ నీటగు కొప్పునఁ గప్పు పూని శృం
గారము నీదురూపుగొని గారవ మొప్పఁగ నభజింపఁగాఁ
జేరఁగవచ్చునో తనదు సేవకభావము నాదు సేవ్యతన్
ధారుణి సుప్రసిద్ధముగఁ దా నొనరింపఁదలంచి నెచ్చెలీ. ౪౭

గీ. ఉవిద తావకసుగుణాదియోగమహిమ, వాసనాత్మక మగురతిభావమిపుడు
రసతఁ గైకొనె నీకు నీక్రమము కాన, వ్యక్తికత్తుంబ మనకు సిద్ధాంత మరయ.

ఉ. నేత్రము వర్వ్యసంతటన నెమ్మి యొనంగెడు సౌష్ఠవంబుగా
సూత్రితరీతి నంగములు చొప్పడుపాత్రత నీకుఁ గల్గదే

పాత్రత నీకుఁ గల్గినను భామిని నిశ్చలవృత్తి నుండఁగాఁ
జిత్రము మాకుఁ దోఁచ నీ చెల్వఁ దొనర్చును మందహాసముల్. ౫౧

మ. రసకృత్సద్గుణ మై యలంకృతిధరప్రస్ఫూర్జితవ్యక్తి యై
భాసిల్లించుఁ సుకవిప్రబంధముఁ ద్వదీయం బైన బల్కోష్ఠ దా
వెసఁ దూలింపదె గర్భకంబునకుఁ(?) దెల్విం గైకొను న్వింతగా
రసవిస్ఫూర్తి నొనర్చు గర్భకము సంగ్రాహ్యంబుగాఁ జిత్రమే. ౫౨

చ. చెలి తలవాంచి చూపెద(వొ) చెల్వపుఁగొప్పిది సాటి దీనికిం
గలుగునొ కల్గదో యనుచుఁ గల్గిన సిద్ధ *మునర్ఘరత్నసం
కలితపుఁగుప్పె చామరముగాఁ జుటయే గుటిలొండి యంచు న
బ్బలువగలాఁడు దా †నిమిరెఁ బంకజలోచన కేశపాశముల్. ౫౩

ఉ. కన్నులఁ ‡గప్పుకొఁ దమముఁ గాదనఁ దేనియ తీపి చూపఁగా
నెన్నదు కల్వఁ బల్కు లోకయింపునఁ బల్కిన బర్హిబర్హముం
§బెన్నెరితేటలం గొనను వింతలుగా మెఱుపుల్ ఘటింప మ
బ్బన్నను రోయు నీకబరి యబ్బున యాకుటిలాత్మ(1)నఖ్యముల్. ౫౪

చ. కువలయజేత నీవలఁ దక్రొమ్ముడి నెయ్యపుఁగొమ్మ (2)యిచ్చటన్
సవిధములై ప్రమాణములు సంగత మయ్యెను జూచి తెల్పఁగన్
నవరనిపాతటం గలుగు చక్కసికుంకుమ పేరి విక్రమం
బవుల ఘటిల్లుమౌక్తికసరాకృతి గాంచిన శుద్ధకీర్తియున్. ౫౫

చ. స్ఫురితగుణానుగామురసముజ్జ్వలమౌక్తికరాజి సద్రసా
కర మతిచిత్రబంధ మధికస్ఫుటచారువిభూషణంబు నై
వరఁగెడుఁ గ్రొమ్ము డుత్తమనిబంధనరీతి విచిత్ర మొక్కటే
తరళమృగాక్షి కేవలము దాఁ గుటిలత్వము మానదయ్యెడున్. ౫౬

క. బిత్తరి మధురగుణంబున, నుత్తమకావ్యంబుఁ బోలు నురుభూషణ మై
హత్తున్ ధృతి యక్కావ్యము, నొత్తు స్ఫుటవ్యక్తి కబరి రోయిగి మధ్యమమున్.

గీ. మగువ ముక్తాళి యిది శిరోమార్గతమము,(?)నరివ్యాతా...మంబు నిరతశుద్ధ
మాత్రసద్గుణ మమలవంశాభిజాత, మొట్టు లన్నన్నహాసంద మొనయ దిచట.

సీ. నెలఁత నీవేనలి నీరదపాళిగాఁ గనుము విద్యుల్లతాఘటనఁ జెందెఁ
గలికి నీతురుము చొక్కపుఁగల్వకుంపుగాఁ జాలనింపువహించెఁ జంద్రరుచుల

* మనర్ఘ్యవి † సెమరె ‡ గొప్పుకొండ § వెన్నెలతేట (1) సౌఖ్యము. (2) యిచ్చలన్

మగువ నీకబరి మన్మథశరాయుధముగా జాలువాజలపోఁతజాను గాంచె
భామ నీభ్రూమ్రుడి బర్హిబర్హంబుగాఁ జంద్రసంబంధచారు పయ్యెఁ
జెలువ చిత్రాళిపాళిగాఁ జికురభరము, సరసతఁ బరించెఁ జంపకచ్ఛాయుఁడాయ
ననుచునఖరోచులంతటనలరుచుండ, గొప్పనువ్వనసౌవిదుఁ డొప్పమీఱె.

చ. కలికిరొ మోము వాంచుటకుఁ గారణ మేమి కలంకిచంద్రుని
దులఘుటియింకఁగాఁ గలుగు దుష్టుల కల్ముల సైఁపలేకనో
తెలివి(ని)దప్పి పామరు లతిత్వర సామ్యము కల్పినంతనే
కలుఁగున సాటి లాఘవము గాఁ బనియేమి మృగీవిలోచనా. ౬౦

ఉ. ఎక్కడివింత మాచలి ............ తోఁటసాటి ప్రొద్దు రా
మిక్కిలి మారుపంకజము మిన్నక పండితమాన్య లీన్ముపా
వాక్కుల కేల జిహ్వ యలవర్చిరి పాగజవైరి చంద్రునే
నుక్కడఁగించుమో ............ యనందగునే పయోజముల్. ౬౧

ఉ. పంకజనీలవఁకరువా భావము దాలుచు కన్నదోయి మే
ల్పొంకము సైఁచునీదుముఖపూర్ణనిశాకరుఁ జూచి చూచి యీ
పంక(జబృంద మెల్లఁ దల)వంపులకుం దగుఁగాక యూర్ధ్వమే
పంకజ*నేత్ర నీకుఁ దలవంపు లహేతుకఁజ్జ మెత్తురే. ౬౨

గీ. వనితరో మోముచందురు వాంచెదేల, కుటిలకుంతలతిమిరంబుకోర...
...నో యనుశంకనో వచ్చుటొప్ప, కటలపాదెందు నేమించ నేరదెద్దీ. ౬౩

గీ. చెలువ ఁజ్జను మోము వాంచితి వటన్న
నవధరించితో నీవు ముఖార్ధహతిగ
విను ............ హతి దాన నెనయు నెట్టు
లదియు నొకచోట దోషత నంద దరయ. ౬౪

చ. మృగమదచిత్రకాకృతిగ మీఱుకలంకము దానిఁజేసి యీ
మృగ†ధరుఁ డేతదా(కృతివహిం)చు నటంచును మోమువాంచుటో
మృగ మసుగంధ మప్రియము మమృష్ట మశ్రింగము దాఁ గలంకమే
మృగమదచిత్రకం బది సమృద్ధగుణాన్వితమా కలంకమే. ౬౫

చ. మృగమదచిత్రకానుగతి మే లగుఫాలము పిల్లతేఁటికిం
దగు లగుకేతకీదళము దా నగువం బొగి నెంచి కొప్పపే

---

* నేత్రి † మదుధేతదా

చ. నెల యిది హైన మన్నయనసీరజముల్ వికసిల్లునట్లు దా
నెలయ రసా(ంబు)రాశి వడి నిక్కఁగఁ బంకరుహంబు గానిచోఁ
గలిగదు నేగతిన్ భ్రమరకంబులసంగతి దమ్మియైనచో
విలసన మెట్లు రేయి యిది వింతగు సంశయ మింతి తీర్పవే. ౭౫

ఉ. ఏనులయం దం(లం)కృతిగఁ బెట్టినసీలపయోజపత్త్రముల్
భానుతనూజ నీయసితభవ్యకటాక్షవిలాసభూషణం
బూని వెలుంగ నీక్షణము లుత్పలకాంతి ధరించు నన్నయూ
టానఁగరా దొకించుకయు నానఁగవచ్చు విరుద్ధలక్షణన్. ౭౬

ఉ. తోయజవైరి హై మొగము దోఁచినవేళలఁ గన్ను లుత్పల
శ్రీయుతిఁ గాంచు వెన్నెలఁ బ్రసిద్ధిగఁ గ్రోలుచునుండుపుల్గులై
పాయకనిల్చు మోము నవపద్మముగాఁగ న దెట్టులోచు నీ
యాయతనేత్రముల్ మెలఁగు నార ముఖాత్మవిచిత్రవైఖరుల్. ౭౭

క. వరవర్ణిని నీనయనము, లరమోడ్పున మోముఁజంద్రునంద మెలఁగుచున్
సురుచిరనీలపయోరుహ, సరసిరుహైకత్వజన్మసంగతిఁ దెలుపున్. ౭౮

సీ. శారదపూర్ణిమాచంద్రమోబింబంబు గర్వసర్వస్వంబు గాసిఁ జెందఁ
దరుణార్కకిరణసంధానజాగ్రన్నవ్యపద్మలాలిత్యంబు పటిమదక్కఁ
జంద్రాతపాస్వాదసమ్మోదమాద్యచ్చకోరవిలాసంబు కొదవగాంచ
మకరందరసపానమత్తమధువ్రతపోతలావణ్యంబు పొలుపుఁదొలఁగ
సరి మొగంబెత్తి చూడవే సీటులాఁడి, వెడఁదకన్నులు విప్పవే బెడఁగులాఁడి
సిగ్గుపడువేళ దప్పవే నిగ్గులాఁడి, నన్ను మన్నింపఁదలఁపవే వన్నెలాఁడి ౭౯

ఉ. ఓపరిపూర్ణచంద్రవిజయోజ్జ్వలవక్త్రశశాంకబింబ నా
చూపులపేరుగొన్న పరిశుద్ధచకోరములానఁ గాంతి దా
లోపము గాంచునంచు నవలోచన వాంఛదె మోము వర్ధనం
తాపము వావ సంపదకుఁ దక్కువె చంద్రుఁడు కీర్తికెక్కఁడే. ౮౦

గీ. విమలముఖచంద్రుసన్నిధి* వేగుగాంచు, కన్నులకునివ్వడుం బెడుకములయులకు
సాటిఁజెప్పంగనమరునే సాటియగును, నెలకునలరెడుజలజంబుగలిగెనేని. ౮౧

మ. అరమోడ్పైపనుఁ దొంటికన్న †నెటియా నందంబు గైకొన్న నీ
వరనేత్రంబుల కెట్లుసాటి యనఁగావచ్చున్ (వ)సంకోచతన్

* వేగు † నెరియానందంబు.

పరసత్వంబుఁ దొరంగి చూడ దెగకై సత్త్వాతికిన్ దూరమై
ధరలో నుండెను వారిజోత్పలములం దన్వీ జగన్మోహినీ. ౮౨

క. విలసనమహిమం బెంతే, కలిగియుఁ దల ద్రుట్టుఁదిరిగి కలయుఁ జతురిమం
బలవడమి దుర్యశముక, జ్జలమై పైనాదు నీనుచక్షుర్యుగమున్. ౮౩

గీ. మగువ నీవు దృగుత్పలమాలయందు
మాలవాలంకృ(తి)యొనర్చ మెఱుఁగు గాదు
ధూపఫలహేతువులఁ జాల రుచికరంబు
మిగుల సుత్రేపతుఁ గావింపు సొగసులాఁడి. ౮౪

ఉ. అప్పతరంగల * న్నిగుల నప్పుడుఁ దప్పదు కోప మంచు నీ
విప్పుడు చూపు చాలుకొననీక పెసంగెదొ యట్టులైన నో
యొప్పులకుప్ప కొప్పుజిగియొప్పుఁదనంబునఁ జాయ మాయఁగాఁ
దప్పక సేయు నప్పుమదిఁ దప్పనిలోఁచు టెఱుంగవైతివే. ౮౫

చ. చెలువరొ సర్వలోకములచేతులమోడ్పులు గంటిఁగాని నేఁ
గలనయినం గరాబ్జములు గట్టిగ మోడ్చుటెఱుంగ నేరికిం
బలుపలగష్టు వేచలి(యఁ)బాయును † నప్పుఁ గృతార్థుఁజేయు మం
చలికులవేణి సిగ్గునకు నంజలి సేసెనఁ జక్కఁజూడవే. ౮౬

ఉ. ఎట్టివిశిష్టదేశమున నీమక వెంతటి శాల మెట్టినో
మట్టిటుఁగా కొనర్చుచుఁ గృతార్థతఁ జెందెనొ నీదు మోవితోఁ
జుట్టరికంబు సేయునతిసుందరపంజరపద్మరాగముం
గట్టిగ ధొండపండనుచుఁ గ్రక్కున ముక్కున ‡ నొక్కుఁ జూచితే. ౮౭

ఉ. వీనులభూషణం బగునవీనమృదూత్పలముల్ కటాక్షదృ
గ్లీనము లయ్యె వ్వాని కవిగీతము ప్రత్యసత్సభావముల్
గానఁ దదంతరాయఘటకత్వ§మయుక్తము కన్నుదోయికిం
బూనిక తెప్పలెత్తి ననుఁ బొందుగఁ జూడుము సుందరీమణీ. ౮౮

ఉ. కన్నులక్రేవఁ గన్గొనఁగఁ గారణ మేమి కటాక్షవీక్షణా
భిన్నమహేంద్రనీలమణికీలితమాలికలన్ శ్రవఃపుటా
సన్నగభీరకూపములఁ జాలఁగ నించుచు వానిమీఁదుగాఁ
జెన్నుగ నేగి ముచ్చిలికిఁ జేయుటకై జతనంబు పూనెనో. ౮౯

* న్మిగులు † నమ్మ ‡ నొక్కు § మయుక్తము

గీ. వనితయురగన్నుఁగైకొనినను(వ)సు దెలియ, నాత్మ భావించెదో యట్టియాత్మ నీదు
తనువు బల్మినిసాకారతను భరించి, చాతురిమంబొను చుండెఁ బక్కఁగాంచె ౯౦

గీ. నాతి ప్రకృతార్థాప్త ధారత్వమునయ, నతిశయ ద్రంబువకువీకుణాన్వయిత్వ
మేలదయనేయఁదలఁపవు హేతువేమి, గర్భసాదృశ్యమబ్బి పరతననిటులొ. ౯౧

ఉ. చక్కనిచక్కదృష్టులివి చక్కెర రూపినయంత మెక్కి యీ
చక్కి మజ్యోక్తమాట వినవంగతిగాని తెలుంగుగా రొదల్
మిక్కిలిఁ జేయుచున్న యవి మిన్నక యుండకున్నట్లుగాఁగ నో
చక్కనిబొమ్మ చక్కనకుఁ జక్కెరయెమ్మ్యులో క్కిఁ బల్కవే. ౯౨

క. నలయుందురు తామరయని, పలుకుదు రీమోము బుధులెః భవ్యామృతముం
చిలుకఁగరాదె మరందము, గులుకఁగవలదే బుధోక్తిఁ గుఱుచవటిచదే ౯౩

క. చిక్కను నాదగుభావము, చిక్కముగా వరచితంపు నెజీవల్లులకుం
జక్కని చెలిరో యిర్పుడు, చిక్కెదునీమధురవచనశృంగారములన్. ౯౪

క. రాలుగరఁగించునేరుపు, చాలఁగ నాకబ్బునెడు చందురుగర్వం
*బేలాచల్లింపఁదలఁతు, రాతెల్లం గరఁగఁ బాట రహింపఁగదే. ౯౫

క. రూపవతి మామకశ్రుతి, కూపంబుల నమృతవృష్టిఁ గురియఁగరాదే
రూపింప నీకువదనం, బేపారెడుపూర్ణచంద్రుఁడే నిజమయినన్. ౯౬

చ. పరుషము తాచు నీరసతపట్టయి †చెక్కులఁ డంకరించి ని
ర్భరవహనక్షమాన్పదతఁ బాటిలురత్నమయోపకుండలా
భరణము లేల వీనులకుఁ బంకజబంధునికూర్మిపట్టి నీ
వరసమ్మృదూక్తి భూషణము చాలు నలంకృతిగాఁగ వీనులన్. ౯౭

క. శృంగారవతి కుచద్వయి, సంగత మగురీతిఁ బల్కు సంగతేము దగున్
భృంగాలక నిలువెల్లను, బంగారం బైన మాట బంగారమఁటే ౯౮

గీ. అరిదిమాధుర్యము త్తరోత్తరముగాఁగ, వస్తువుల నన్నిఁ బంచవిప్రథమలమరు
సార‡భూమకుఁద్వియెచ్చటనునీమ, మధురసూక్తిఁబయినన్నిఁ బ్రథమసున్న.

క. ప్రకృతిర్వికృతిస్సాల, ప్రకృతిస్వీకవిత చిత్రపద మగు ననుచుం
బ్రకృతి విక్కృతి స్మాల, ప్రకృతి న్నిరసించువారు పలుకుదు రింతీ. ౧౦౦

గీ. వనజలోచన నాదుగాయనత కొప్పి, యమళ్ళై పాటపాడెదోయబ్ర పెందవఁ
దరుణి నాగాయనత సమ్మతంబుగాక, కొదవెఱుఁగ కరొూగ వద్యోదవా చెపుమ.

---

* తేలచలింపందలచెదు † చెక్కుల నలంకరించి ‡ భూషణ

క. చంచలనయనా చాచంచల, చంచల*వీణాధరించి చతురతచే వా
యించెదవో ధ్రువవీణ భ, రించెదవో తెలుపు మాదరించి కృశాంగీ. ౧౦౨

గీ. శ్రుతిపుటంబుల కమృతంపుసోనలైనఁగ, మానసాంభోజ మభినవమాకరంద
మాధురులఁ దేల నీవేళ సాధుశీలఁ, దేటగీతి వచింపవే తేఁటికంటి. ౧౦౩

క. నాలుగువిధముల నభినయ, లీలలు నీకంటెఁ దెలివి లేదన వశమా
యాలోలనయన యిప్పుడు, పోలిన యభినయముఁ దెలుపు†ప్రొద్దుచనుటకున్

గీ. కలువకంటుల‡కిన్నరకంఠి పదము, రాగరూపత నీయందు నొనరఁబూను
ననుచు జనులాడుకొనవిందు నది నిజంబొ, కాదొ తెలియఁగ నగుఁ జాటకతనమాకు.

మ. అతిరక్తాధరసన్నిధానమున నాసారూఢముక్తాఫలం
బతిశుద్ధం బతిరక్తమయ్యె నిది యన్యాయం బుపేక్షింప నీ
వతులజ్ఞానవిధానమూర్తివిగదా యబ్జాక్షి మందస్మిత
ద్యుతిమాత్రంబున దానిదోష ముడయం దోలం గటాక్షింపవే. ౧౦౬

గీ. ముదిత నీముక్కు ముక్తాముత్యమునకు, నాత్మశుద్ధగుణప్రాప్తి నగునతద్గు
ణంబు రూపింప నన్యగుణంబుఁ గొనఁగఁ, దద్గుణంబు ఘటిల్లుఁ జిత్రంబు కంటె.

గీ. జ్ఞానదీపంబున నవిద్య నణఁగ శుద్ధ, మాత్మరూపంబు దీపించు ననువుదోఁప
వెలఁది నీనవ్వు ననుఁ గెంపు విచ్చిపోవ, గా ననగు ముత్తియము శుద్ధభావమగుచు.

గీ. వికసదంభోజపూర్ణేందువిధముఁ దెలుపు, ముద్దుసిద్ధంపు నీ నెఱిమోమునందుఁ
జెలుతన వైవ్వన నిఁక నేమి చెప్పవచ్చు, మధురసామృతవిభ్రాంతి మానదింతి.

మ. తెలియక మోము వాంఛకొని తేటలనవ్వులు దేరనీక యీ
వలనున నున్నఁ జంద్రముఁడు వారిజతుల్యముగాన మోము నే
వలముగ వాంచియుండెఁ దనవాసియ గల్గుమొగంబు వెన్నెలల్
‡సిలుకకయుండునే యని హసింపఁ దలంపులు నింపఁడా చెలీ. ౧౧౦

క. ఈమాడ్కిఁ బలికి యాదవ, సోముఁడు లేనవ్వు పూర్ణసోముని నవ్వన్
భామామణి నెఱసొగసుల, మోమునఁ జెలువారఁ దనదు మోము ఘటించెన్.

క. నెల నెలయు(ను) వెన్నెల వెన్నెలయును నెత్తమ్మి తమ్మిసీటునఁ గవియం
గలసొగసుఁ జూడఁ గలువల, ములుకులవిలుకాని కపుడు ముచ్చట యయ్యెన్.

గీ. అజ్జగద్గురునుపదేశయత్నమహిమ, భావమున నించు ప్రేమానుబంధపటిమ
హరిణలోచన తాదృశాల్యంతిఁజ్జ, విద్యచూపఁగ సాగె నవిద్య పోల్చి. ౧౧౩

---

* వీణగా- † ప్రొద్దుచ్చుటకున్ ‡ కిన్నరకంటి ‡ సిలుగక.

క. ఆపడఁతి కొంతలజ్జకు, లోఁబడం బెనయుంగఁ బ్రేమలుప్పతిరమై
దీపించ బడు లోనర్పఁగ, వ్యాపారముదక్షి కృతము వామోదించున్. ౧౧౪

సీ. సుకుమారవర్ణనంఘటితస్వరూపంబు లలితప్రసాదన లక్షితంబు
ద్రుతికరమాధుర్యధుర్యస్వభావంబు సవిశేషపరివృత్తికాంచితంబు
పతితిరస్కృతవాచ్య మవిహితదోషసర్వస్వంబు రసికానురంజనంబు
నగుచు సత్కావ్యంబు నందంబు గానియేని పవిమృష్టపద్విధేయాంశమగుచు
స్త్రీపదమై పుఁరద్ధిప్తి విస్తరిల్లి, భూషణస్ఫూర్తుల కనంగపోషణముల
కాటపట్టయియొకవింత తేటఁగానిదె, మోముసీదనివెన్నుండుమారుకొనిదె.

గీ. సాత్త్వికస్వేదజలసుధాశ్రయతఁగాంచు, నలికచంద్రుఁడు విశదముక్తాళిపేరు
గన్నయాత్మీయపేశలకాంతిధార, ఘనపదంబునఁబ్రోచెఁ గలికికంటి ౧౧౩

మ. *శపమానాన్వయమానకస్ఫురితమై యొప్పారుచుం జిత్రకం
బపరక్లిష్టతఁ జెందె నేనియును †పక్త్రాభిజ్ఞమా భాగ్యవ
ర్ణపదత్వన్నిటలస్ఫురత్తనకపత్రంబంచుఁ బద్మేక్షణుం
డపరిచ్ఛిన్నరసాదృతాశయత ముద్దాడె న్నిటాలస్థలిన్. ౧౧౭

గీ. చాన మోము విశేషోక్తిఁబూనదిపుడు, సామ్యమందమిగుణహానిజాడఁజొరమి
సునయనాంజనకవులకుఁ జాడనమరు, భావరసదృష్టు లందుటఁ బద్మనయన.

చ. భ్రమరవిలాసముల్ పథరభవ్యతరోత్పలమాలికల్ కటా
క్షములన చేసి మోలఁ ‡వికస్వరత ల్లలితంబుగాంచె నే
త్రములు ఛవీర వైదుషి యుదారత యం చొగి నెన్నుచున్ రమా
రమణుఁడు చేసెఁ దన్నయనలక్ష్మికిఁ జుంబనలక్ష్మిఁ దోడుగన్. ౧౧౮

క. కంబుధరాధరసంగత, తాంబూలరసంబుసోఁకి తరుణేందుమిభా
చుంబితనీలాంబుజములు, చుంబించెను సూర్యజాతచాక్షుపుఁగన్నుల్.

క. హరికృతచుంబితపరిచిత, సురుచిరతాంబూలరాగశోభితదయుల్
తరుణ(శశి)కిరణచర్వణ, నిరతచకోరములసీటు నెఱపఁ(గ)సాగెన్. ౧౨౧

గీ. మురవిభంజనుఁ డప్పేశి ముద్దుగొనఁగ, రమ్యతదధరవీటికారసము నయన
పద్మములనత్త మద్వేలబహుళరాగ, రసము వెలికుబ్బెనోయనరమణగాంచె.

* శపమానాన్వయ † వక్త్రాభిజ్ఞ ‡ వికస్వరతల్ సిలతంబు.

క. పంకజముఖి కను కాటుక, కంకజలోచనుని మోవి కయి నవ్వేళం
బాంకమయి కనఁగ నొప్పెన్, మంకెన విరి మీఁద మెలఁగు మధుప మనంగన్.

గీ. సాంజనాతిచలేక్షణసంగమమున, నతులరాగాధరము కప్పు నందె నపుడు
సాంజనాతిచలేక్షణసంగమమున, నతులరాగాధరము కప్పు నందు టరుదె.

గీ. అబ్జహితనందనామణి యనుభవింప, మధురిమమాధుర్యరసము నుంచి మషివిడాంక
ముద్ర యిడి సిల్ప రాజిల్లు విద్రుమంపు, నాళమన నొప్పెఁ గాటుక నలుపు మోవి.

ఉ. కాటుక కప్పు మోవి జిగి గాడిలి నవ్వ్రణ బొత్తుఁ గూడుచుం
గైటభదైత్యవైరిముఖకంజమునం దనరారెఁ జూడఁగా
*మాటికి సాటియైన రసముఖ్యము లాదిమకోణసుభ్రమల్
మేటిప్రబంధరాజమున మేళన మంది మెలంగు కైవడిన్. ౧౨౮

మ. తొలుత న్నందుని యింటిలో మెలఁగి నీతోఁ బుట్టు కాళిందితీ
రలసత్కాననభూమి గోగణము సంరక్షించి తీమీఁద నీ
వలచుం జెక్కిటఁ గేళిపత్రమకరీవారంబు పాలించెదం
గలకాలంబును బాసపాల్యమె కనంగా నోఁచితిం గోమలీ. ౧౨౯

గీ భవ్యగండద్వయికిఁ గేళిపత్రములకుఁ, బొందుఁ గొనఁ గూడ దన్యోన్యభూషణాబు
పుట్టు మొదలు గబ్బు గండములకు నోఁచు, నట్టి యవిభూషణతకర్హ మనఁగ నగునె

గీ. అతులవాసన నచలభావానుభూతి, ననమమార్దవగుణమున నప్రతీత
తాళతల్పంబుచేఁ గదా తరళనయన, కలిగె నీ చెక్కులకుఁ జంద్రఖండసంజ్ఞ.

గీ. అసితపక్ష†గత్తుహినాంశుఖండ, తుల నెసంగిన నమృతంబు దొలుకవలదె
కలిమి లేములు దెలియంగ వలయు మాకు, ననుచుఁ జెక్కిలి నొక్కె శ్రీహరి ముదమున.

గీ. మించుటద్దంబు నీచెక్కు మించు నంచు, నెంచుకొనవిందు నది నిజమంచు నెంతు
నిందుబింబాస్య నా మొగంబిచట నిలువ, నమలినచ్ఛాయ ప్రతిబింబమబ్బెనేని.

గీ. ప్రకటదర్పణరుచిరేందుశకలములకు, నుపిదనీచెక్కుల(కుఁ)బోనరుక్త్యమనుచు
బుధులు పల్కుదురిటదోషబుద్ధివలదు, శాస్త్రమరయంగ విస్మయస్థానమగుట.

చ. నిటలతటంబునన్ మెలఁగు నిద్దపుఁ గస్తురిచుక్క ‡బొట్టులోఁ
గటికికలంక మానసుచుఁ గ్రమ్మితిఁ జుంబనవాంఛ నంశయం
బటమటమే కలంకపద మంచితలక్షణమే వచింపఁగాఁ
గుటిలవినీలకేశి యని కూర్మి నొనర్చెను జుంబనం బటన్. ౧౩౫

*మాటకు బాటయైన †గతస్తుహినాంశు ‡బెట్టు

క. *బాయదు నంహస్ఫురణముఁ, బాయ దనం కాళరూపభావాస్పదలౌ
†ఏయనువు మంగళమహా, శ్రీయనఁ నక్సూక్తి యమరెఁ జెలి వీనులకున్.

ఉ. ఇంచుకయేని లీలఁ గొన డీకలు వీనుల కేగుదెంచి నీ
యంచితనేత్రముల్ జయము నంతికకర్ణమహాధునన్నిధిం
బొంచెను భీతిఁ గూడములఁ బొందవు నేత్రము లంచు మీాలస్రు
క్కించినవాని కట్టిభయకీర్తన ముద్దున కాచె నచ్ఛ్రుతుల్. ౧౩౮

ఉ. కర్ణపతంసనామ మిటుఁ గాంచెద ద్వక్ప్రభ సంపు విచ్చి య
ధ్వర్ణము సేరెఁ గావలయు నద్దిర యీాయసితోత్పలంబు దృ
గ్వర్ణపరంపరాంతరధిగానతఁ గైకొని లీన మయ్యె ని
క్కర్ణమునందు భూషణ(త) గైకొను నేకరణిం గృశోదరీ ౧౩౯

గీ. కర్ణమునఁగల్వకనుచాయఁగవ్వకొనఁగ, మీాలితంబయ్యెఁగంటిపేలాలితాంగి
యంతిసామాన్య మిచ్చట నెలకలుగు, మహిగధర్మవిశేషసంబంధ మిదియ.

గీ. బ్రహ్మయనవొప్ప శ్రుత్యంతలక్ష్యమగుచు, దనరు నిక్కల్వ శ్రుత్యవతంస మగుచు
నుపనిషద్రీతి నిది మన కొప్పఁబలుకు, వేత్తృవేద్యంబులకు భేదవిదళనంబు.

గీ. తన్వి యీాకల్వ శ్రుత్యవతంస మగుట, నాత్మరూపంబు లక్షింప ననుచితంబు
ఇచట రూపంబు లక్ష్యత నెనయ దెట్లు, దృష్టివిక్షేపమున నది తేటపడను.

చ. కలువలు వీనుల న్మెలఁగఁ గారణ మేమి విభూషణంబుగాఁ
బలుకఁగ సాహసంబు గద భావము నీయది యేమి తెల్పవే
తెలిసెను గల్వ కన్నులకుఁ జేటల సాటగునంచుఁ బల్కుచోఁ
జెలివికిఁ దప్పువారలకుఁ జెల్వగఁ జెంతల వాని నుంచితే. ౧౪౦

క. అతినిమ్నశ్రుతికూపం, బతిపూర్తిగ మెలఁగి పైకి నదరుశుచిరసం
బతితీవ్రత వెడలించిన, గతి నున్నది వీనులందుఁ గలువ వో చెలువా. ౧౪౧

చ. సురుచిరహీరనీలముల సొంపగు కమ్మలకాంతిధార యే
కరణి వెలుంగుచున్నయది కంటివెఁ దామరకంటి శ్రోత్రకూ
పరమణమాధురీరసము పైకిఁ గడంగుచు జాలుసూపె జ
స్వరసముతో ననం దగిమొ నంచొగి నంటుచు రెండువీనులన్. ౧౪౨

*బాయదునఘస్ఫురణము—†యొనయత్రు

క. అలఘువిలాసత గానా, కలితాజరభాంచితత్వకముకతగానే
వలనునఁ జంపకమాలా, లలితత్వము నీకునాన లాగెం జెపుమా. ౧౮౫

గీ. సుఖదమరుదంచితస్పర్శశోభితంబు, నవ్యవహితస్ఫురద్రసం బవరుమంబుఁ
గైశికీవృత్తి యన నాన గదు వెలుంగు, నొకసరంధత వదలకయుండుఁగాని.

గీ. మధురిమంబున నీమోవి మధురిమంబు, శంకపడఁజేయ నాసికాచంపకమున
వెడలి మొనరించినిలిచినవిపులమాక, రందబిందువునామౌక్తమంద మొందె.

క. బిత్తరి నీనేత్రంబులు, ముత్తియపుంజిప్ప లనఁగ ముద్దుగులుకు నీ
ముత్తెము జన్యము గాదా, హత్తినప్రేమమునఁ జూడ నగ్గము గాదా.

చ. అని వనజాక్షుఁ డంచితముఖాంబుజహాసమరందపాళితో
మనమున రాగసంపద యమందతఁ జెందఁగఁ జిన్నినవ్వుతోఁ
జెనఁగొని ముత్తియంబు నొకవింతయొయారము దాల్ప నానవా
ఖని యగునాసపై వదనకంజముఁ జేర్చుచు మాటిమాటికిన్. ౧౮౯

గీ. ఉవిద యద్భాహుసంవానయోగ్య మగుటఁ
బ్రతిభటస్ఫూర్తి సైఁపనిప్రభలుగొనుట
వేడ్కఁ గంఠంబుఁ గనఁగ నివ్వేళ నాదు
పాంచజన్యంబు మదిలోనఁ బాదుకొనియె. ౧౯౦

క. నతి నీమకాలికి కుపమే, యత యర్హామె యొక్కభంగి నది యొప్పంగా
నతిమృదుతన్ సుస్వనతన్, వ్యతిరేకం బనుచుఁ బలుకు నది చిత్రంబే.

గీ. కలికికలుగమ లగుఁగదా కంబువునకు, నాత్మరూపప్రబోధంబునందు నెపుడు
గాన జడమగునదియెట్లుగాంచుసాటి, యాత్మరూపప్రబోధంబునందు నెడకు.

గీ. అర్ధనిద్రాన్వితం బగు నారకంబు, పతివ నీకంధరకుఁ జాల నలికియలికి
యట్టిదానికినుపమానతాస్వయంబు, గగనకుసుమంబుతో మైత్రిగాంచుసుమ్ము.

ఉ. చుంబితమై రొదల్ నెఱపఁజొచ్చినకంబువు*తోడిసాటికం
తంబున కందఁజేసెనఁ గటా కట †మచ్చికయూని పల్కుచో
క్షంబుగఁ బల్కఁగాఁ దలఁపుఁగాంచి యకార్యము గాక కార్యమే
కంబువుసాటి కీర్తికరమే యది తీయఁగఁ బల్కనేర్చునే. ౧౯౪

గీ. సరసిజానన నీకంఠసరణిఁ దెలు(పు), ప్రస్ఫురద్వర్ణమాధుర్యవచనములకు
సాటియగు నెట్లు తతవాద్యజాతరవము, మధురిమేనియవర్ణతమానదెపుడు.

---

* తోటిసాటి † మచ్చికయూనిపల్కుచోకంబుగ

క. ఓసరసురాల విజయుఁగ, నీ *సరసపుఁగోలికి వెసలు నేతీపలుకులకున్
దోసము సరియున్న రసా, భాసాస్పదసుకవికావ్యకృత్యములుల్. ౧౬౬

గీ. తరుణి తలఁప నవర్థచేతనత నుండు, శుకము పికముఘనాగమస్ఫూర్తి నెసయు
మఱియుఁబికము త్వద్ధ్వని నెతీనవుఁగ, నీ సుగళసూక్తి వలెనట్లుగాంపుగావు.

ఉ. తావకకంఠనిస్సరసుదంచితభారతి సద్గుణత్వసం
భావిత మైన దోషముల భాసిలు దోషగుణత్వదూరతా
భావుకు లెన్నదోషముల కజ్జ మెలంగదు దోషమూ గుణం
బేవిధిఁ బూన దిష్టగుణమే కొను నంచు వచింతు రుత్తముల్. ౧౬౭

క. నీరసములు గాన నలం, కారము లివి గావు నీముకంఠంబునకుఁగా
సా(ర)రసోత్కృష్ణగుణా, ధారము లగుసువచనములు తగుభూషణముల్.

క. పటుబాధస్ఫురితము లు, త్కటబహుకథవస్తుసంవిధానకుముముల్
†త్రుటితాసారా(?)రంధ్రము, లటు నుగుణములు విఘటిల్లునవిగాసొమ్ముల్.

సీ. అనుకరణంబుచే ‡వగృహీతసంస్కారముఖనిత్యదోషసంస్ఫురణ మడఁచి
శబ్దతత్త్వాగవై శారద్యమున శ్రుతికట్వాదిదుష్టత కాకుసేసి
యంగాంగితాకథవాదిసాధనముల రసదోషనిచయంబు రాణఁగుంచి
వ్యక్తవాచ్యార్థప్రబంధౌచితీగతి రచనాద్యనర్హత రహి హసించి
రసికు లౌనవఁ ద్రిప్రకారత ఘటిల్లి, నాల్గువిధముల రచన మిన్నానసంబుఁ
గొంచు నీకంఠమున నిస్సరించుననంచు, వినికి నాకగువదికొల్లి కనువుసొమ్ము.

చ. అని వనితానురాగరసహర్షనముత్కటమానసంబుతో
వనజదళాక్షుఁ డత్యతివబంధురపేశలకంఠనాళముం
దనముఖపద్మసంగతినిఁ దద్దయు ముద్దుఁదనంబు గుల్కఁగా
ఘనకరివాబ్జసంభరణకౌశలహస్తము మెచ్చెఁ దార్క్ష్యుఁడున్. ౧౭౨

చ. కుచపదమండలంబున నకుంఠసజాతివిజాతిభూషణ
ప్రచయము శ్రీరసీరవయభావముతోఁ దిలకింపలక్రియా
ప్రచితము నాచు నద్రనము భాసిలఁ జేయుచు దోషవిక్రియా
వచనము దూరమై మెలఁగ వర్తిలుచున్నది కంటివే చెలీ! ౧౭3

సీ. నిరుపమనానామణీచిత్రరుచిరాజిడంబుమీఱిన రోహితంబుగాఁగ
భావనాతీతసల్లావణ్యపూరంబు సౌదామనీలతాచ్ఛాయగాఁగ

*సరసులకోలికి †తృటితనిస్సారరంధ్రము- ‡నవిగృహీసంస్కా-

గీ. చక్రవర్తిత గాని యరిచక్ర మణఁచి, కటుమహాభోగమున నురోభద్రపీఠి
రాణఁజేకొను భూధరరాజమునకుఁ, గోకచాటున మెలఁగంగఁ గొదవగాదె.

క. ఎడఁకు డిగి కూన మఖశశి,నడఁచి జయింపంగఁ దలఁచు ననుచును జెలువా
కడుఁగ్రమకజాలములోఁ, బడనిడి కుచకోకములను బంధించితివో. ౧౮౬

శా. కాంతాపీనకుచ బులాకృతిచమత్కారంపుగూఢధ్వనుల్
కాంతాసన్నిభభక్తిఁ బొంగి నెఱఁగారజ్ఞులూహించుదృ
ష్టాంతవ్యాప్తి సార్థకంబుగ మదిం జాల న్విచారించి యో
కాంతారత్నమ కంచుకాకృతిఁ బ్రస్తారించితే గుబ్బలన్. ౧౮౭

గీ. నదుమనెనుమిన్నపైఁ దన మెడయు కెనయు
ఘనఘనత్వంబు ఫలమయ్యెఁ గాని సూక్ష్మ
సూక్ష్మత ఘటిల్ల దనియెజ్జ సొగిసి యవిక
చాఁటు కుచమందె నో యది నంది నరుదె. ౧౮౮

మ. అతిసూక్ష్మం బగుటన్ రహస్యతమమే యాఁగా స్వరూపంబు మా
నితిగా దానిఘనాంగతం గొనుచు మన్నింపంగదా సౌఖ్యముల్
సతి నీగుబ్బలు గొప్పగొప్పలగుఁగా స్వాయత్తసంరక్షకై
యతిగోప్యాకృతి మాని యుంచు టరుదా యాత్మ న్విచారింపుమా. ౧౮౯

మ. అలగూఢధ్వనికి న్నిదర్శనము దా నాచుం జెలంగుంగదా
బలుచన్నుంగవ మున్ను నే నిపుడు తద్భావంబు నైఁచ న్మను
జ్జ్వల*రీతిత్వము నీవు మెచ్చుకొన సంపాదించెద న్గంచుకా
కలనం బాఁపు చగూఢమైనధ్వనితో గారాపుసాదృశ్యమున్. ౧౯౦

గీ. అనుచు హృద్గతతద్గ్రంథికపుకుచికల, భావమొనగూర్చి కంచుకావరణముడిపి
పరమకారణ మగువేల్పు బయలుపఱిచె, సత్తుచాత్మస్వరూపంబుచాలఁ బ్రీతి.

క. కలికి చిననాఁడు చేతికి, బలుగుబ్బలి మేలుపూలబంతి యగుంగా
యలచేతి కిపుడు కుచమిడి, బలుకొండై మేలపూలబంతియు నయ్యెన్.

గీ. మేలుబంతుల నెల్లను గేలిసేయుఁ
బ్రాయమెక్కినకొలఁది నీబలుకటికిత
నంబు గాను సూక్ష్మమొక్కగుణంబు సొరగ
నెనయు దపకాశసద్వృత్తమెట్లు కుచము. ౧౯౩

---

*రీతత్వము

ఉ. కొండలనైన లేఁతవిరిగుత్తులకైవడి మీట రాజవే
దండముఁగొండముల్ విరియ వ్రాఁకఁగ దక్షతగల్గి మీటి యొం
డొంటిని డాసి మా తెలుఁగుకొండను కోడెమిటారిగుబ్బలో
యండజయాన హస్తగత మయ్యెడుసూత్ర మదెద్ది తెల్పవే. ౧౯౪

క. పాలిండ్ల మరగి తిఁగి(తి,) హేలావతి(చి)న్నయార్యు డిప్పుడు నీమే
ల్పాలిండ్లు మరగి తిరుగఁగఁ, బాలయితిం గదవె కోర్కె ఫలియింపంగా.

గీ. మగువ ! యోతత్పయోధరమండలంబు
బ్రహ్మధర్మాత్మ్యమోదంబు బలియఁజేసె,
మదిరనేత్ర పయోధరమండలంబు
బ్రహ్మభ్రష్టోదహేతువై పరఁగుటరుదె. ౧౯౬

క. గురుశుశ్రూషణ మవసం, బరమసుఖం బిచ్చు ననుచుఁ బలుకుదురు బుధుల్
గుర(వ)కుచరశుశ్రూషన్, పరతిశయసుఖంబు మాకు నలకొనదె చెలీ

గీ. అడరి ద్విజరాజచక్రంబు దండ జేసి, వ్యూహలతరసుమనఃపక్తు లొడఁగఁజేసి
మిగులనుద్ధతిఁగొన్నని మెఱుఁగుగుబ్బ, మగువమర్దింపఁగ సూకుమానఁదగునె.

సీ. కుచములు గిరులన్న గొబ్బునఁ బరుషత సాదృశ్యహేతువై చాలఁదోఁచుఁ
దోఁచిన మృదుతనూద్భూతకుచంబుల కదియైన వైషమ్య మనెడుశంక
బలుకుచంబులు పూలబంతులైన మృదుత్వ మచ్చటఁ గారణంబనెడు తెలివి
వివరింపఁ దెల్పు శ్రీషమతకవకాశ మంబరకుసుమంబ యనెడు మనసు
కేలఁగైకొని మదిఁ బరీక్షింపఁ దెలియుఁ
బరమభావమృదుత్వ*సద్వృత్తలత్వ
పీనతౌన్నత్యములఁ గొన్నిభేదములిటఁ
గరణములు మాటికని చన్నుఁగవ గ్రహించు. ౧౯౯

మ. బలుకొండొక్కటి మున్న నాకరమునన్ బాగైనపూబంతివా
విలసించెం గద మేల్కుచంబు లివి యీవేళం గరాయత్తత
న్వాలయ స్వార్ధవమేని తత్సదృశత న్వీక్షింతు నక్కొండ క
న్నలఁపొల్పన్ జనియించె నంచు హరి మిన్నాగుబ్బ లొత్తుం గడున్. ౨౦౦

గీ. అతిశితపీనవక్షోజహద్వయీపి, మర్దనముఁ జేసి చేసియు మఱియు మఱియుఁ
గాంతుఁడుడు నాఁడు స్పృశహస్తకంజమింతి, చిత్రమిది యనిక కుచపీనచలఁగఁజేయు.

*సద్వృత్తత్వ-

సీ. జోడువాయక కూడి జొబ్బిల్లెడు సుగంధధూళిపంకంబున బ్రుంగిబ్రుంగి
కమనీయకుసుమసంగ్రథితకందుకముల సలరులీలల వాడ వాడియాడి
గురుతరమత్తేభకుంభస్థలంబుల నెఱినాక్రమింపంగ నిక్కి నిక్కి
యతిఘనాత్యున్నతాహార్యరాజంబులఁ దడయక తత్పద్ధతి దాఁటిదాఁటి
శ్రమజలం బూర యొక్కింత చక్కనిలుచు
కుచకిశోరంబులను జూచి కోర్కి మీఱ
ముద్దుగొన *మనసుపుట్టెడు ముదిత యనుచు
ముద్దుఁజనుదోయి శ్రీసతి ముద్దుఁగొనియె. ౨౦౨

గీ. చంద్రుఁ డొక్కఁడు బాధింపఁ జక్రయుగళి
యిందుముఖి నీదుగుబ్బలై యొనసి యిపుడు
చూడు బహుచంద్రభూషణస్ఫురిత మయ్యె
ననుచుఁ గుచముల నఖరేఖ లంటఁజేసె ౨౦౩

క. నెల యొక్కఁడె చక్కవ, లలికుంతల నీదుకుచము లై జనియింపం
గలిగెఁ బహునఖచంద్రా, కలితతఁ దీపిన యని నఖంబులు నాటెన్. ౨౦౪

గీ. సర్వగురుచిహ్నములు గానిచన్నుదోయి
సర్వగురుభావ మొలయఁగంగ శక్య మగునె
యనుచు గోవిందుఁ డానంద మతిశయింప
లీలఁ గుచముల శాతాంకరేఖ లిడియె. ౨౦౫

క. హరినఖపదచిహ్నిత మా, సురుచిరకుచకుంభయుగళి చూడఁగ నొప్పెన్
వరశుకకలితముఖదారిత, పరిపాకమనోజ్ఞలికుచఫలయుగ మనఁగన్. ౨౦౬

చ. గిరులకుఁ జిత్రపత్రలత గీల్కొను టబ్రము కప్పూరంబుచేఁ
గరము మెఱుంగులీను మృదుగంధ మలందఁగఁజేసి తెల్లడా
ల్గిరులకు సాటిఁదెచ్చి యటఁ గేళివసించు శివుండ వద్యోదం
దరుణి యటంచు నించు హరి తత్కుచసీమ సుగంధపత్రముల్. ౨౦౭

చ. శుకము మహాగమాంతరతిఁ జాడ్కికి నింపగు దాడిమీఫలం
బకట పునర్విదారణము నందెడునట్లు ప్రయత్నమూనె నా
మొకము సమందహాసమయి ముద్దులు గుల్కఁగఁ గొమ్మ పైఁడిడా
ల్పుక చకలూరు పద్యోదను జక్కఁగఁ గప్పెను బొమ్ముఁ గ్రక్కునన్. ౨౦౮

*మనసుపుట్టెడు.

క. అతిశయపోన్నతవృత్తిం, బ్రతిలేకుండియును మధురరసమేరీతిన్
సతి నీకుచపదమండల, మతిచిత్రము మధ్యవృత్తి యగుచుం జెలువొన్.

క. నేయ మగు చేకగురుతో, న్నయంబై సర్వవృత్తనిచయాద్యంబై
పాయదు గా శ్రీవృత్త, శ్రీ యీపక్షోజయుగము శృంగారవతీ. ౨౧౦

క. కరుమంబు లగుటఁ గుచములు, సరళ బులు గాక యున్న సఖ చిత్రంబే
స్థిరము లగుచున్న వబ్రము, పరమాణుసమానమధ్య పరికింపంగన్. ౨౧౧

క. ఈకుచపదమండలమున, శ్రీకరభావమున మెలఁగు చెలువౌభావల్
శ్రీకర ముభయశ్లేషమొ, కోకస్తని చాలఁజాల గుఱుతుగఁ గంటే. ౨౧౨

చ. మదభిమత(ంపు)శయ్యయయి మానితభూషణమై యదోషమై
ముద మొనరించుఁ గావ్య మన ముద్దుఁగుచద్వయి చిత్ర మొక్కఁడే
పదములగా త్రి సద్గుణము చాలఁగ సూక్ష్మతఁగాంచియేని దాఁ
గదిసి సొరంగ నంది యటఁ గానఁగ శక్యముగాదు చూడఁగన్. ౨౧౩

క. ఈరీతిఁ గుచము లెన్నుచు, వారిజలోచనుఁడు కాంతివారస్ఫురణా
ధారము లగుదోర్మూలా, కారావారములచాయఁ గనుమీ లదరన్.

చ. చెలి కరపల్లవస్ఫురణఁ జెందినదోర్లతికాలవాలమై
యలరెడుబాహుమూలముల కర్ష్యము ఖారము తీవ పూతచే
వెలయఁగ బాగుగా యనుచు వేడ్క నఖంబులు నాటెఁ గతుఁడా
విలసదనూనబాహువుల వేమఱు గందపుఁబూఁత దా నిడన్. ౨౧౪

క. ఆయఁ గనుఁగొనియె శ్రీహరి, యారుచి ముద మొనరఁజేయు హారిరత్నపుమే
ల్చేరుం జలిచీమలబ, ల్బారుం గలహింపఁ బిలువఁబంపెడుదారిన్. ౨౧౫

గీ. విన్నకాసునఁ బొక్కిటివేల్పుబావి, లేమ యాచెంత మధుకరాలీథమగుచుఁ
గలదు పేశలరోమాళికల్పవల్లి, విబుధవరు లగుమా కొగి వేడ్కఁజేయు.

గీ. అతివ యున్నంతమునికి సహావరేణ్యుఁ
దభిమతంబైన తల్పమై యలరఁజేసె
నిపుడు రోమాళిభుజగేంద్రుఁ డీకరాబ్జ
మునకు తా శయ్య యగుచుఁ బల్మొద మొనర్చె. ౨౧౭

క. మాయానరేంద్ర హస్త, చ్ఛాయల రోమాళిభుజగచంద్రుఁడు మిగులం
బాయవహించెను చిత్రము, ఛాయాసుత నీఁకుఁ బాడఁ జనదే చెపుమా.

వసుమబాధమయం బౌటఁ బరఁగుగాద, రీతిఁ బోలెను జనునో యుతే యట్లు
గానరోమాళియనుపేరుపూనుచీమ, బారువయి కెక్కు నాభికవ్వ ౨౨౦.

ఉ. పొక్కిటికొమ్మనుండి వలపుంగిరులంచుఁ గుచంబు లంటఁగా
గ్రక్కున నిక్కునీలఫణిరాజొ కొ పొక్కిటిపాదునుండి వె
వెక్కసగక్కుచున్ బయట నెంతయు స్రుక్కుచు గబ్బిగుబ్బలన్
జొక్కపుకొండలం జదరి చొప్పడుతీవయొ యిద్ది దెల్పవే. ౨౨౧

గీ. రమణి మంజులరుచిరోమరాజిభుజగి, తరుణకృష్ణభుజాదండద దళాక
రాజు తనుఁగూడ నెంతే నిరమణఁగాంచెఁ, జూచి తేమిద్దుఁ దెలి తేటచూపులాఁడి.

క. అతల నీతల దేశము, లతలకెనైనన్ సమృద్ధి ననయఁగ దూమా
పేరమగు మధ్యదేశము, ఖ్యాతిగ నిట నహోభయంబు కలుగుటకతనన్.

క. కాళిందిమధ్యగత మగు, కాలాహి న్నాదుపాదగతి మర్దింపం
జాలితిఁ గరమున నిపుడీ, కాళిందీమధ్యగాహిఁ గడఁగితిఁ బెఱుకన్ ౨౨౪

క. అందఁగొనువార భూధర, మండలవతు లగుట మిగుల మహిమంబులచే
నుండుకొన మెంచు లేమిడి, యుండగు వారల*నబీసయుంటఁగ సాగన్.

గీ. కన్నరో కంటివే నీవుచిన్నవడుము, మిన్నుముట్టినకలిమి చేకొన్నదేని
యొన్న నబ్బుర మిద్ది దానున్నదిక్కు, నట్టినలి వాదులకు నేని యొబు గనీవు

ఉ. ఉరుకుచభూధరంబులకు నొవ్వగఁ బ్రాకులతాసుశత్రుమల్
కరముదలిర్పఁ బొక్కిటిచొకాటపుబొడ్డనబావిలోని యా
ద్వ్యరసపు జాలనా మిగుల నందముఁ జెందెను రోమరాజి యం
చరుదు ఘటిల్లఁగాఁ బొగడు నచ్యుతుఁ డా రొగిఁ గేల నంటుచున్. ౨౨౭

ఉ. విప్పగు నాభిదీర్ఘికను వల్వడి మీఁదికి వేగఁ బాఱు మే
ల్పువ్వురసంపుజాలుగద గట్టిగఁ జొక్కపురోమరాజి యం
దొప్పగు లేఁదరంగలర యొద్దతదంతుర రేఖలో కదే
యొప్పులకుప్ప యీవళు లహో యని మాటికి నంటు మువ్వళిన్. ౨౨౮

గీ. కాదు భావంబు దృష్టికిఁ గానరాము, కటుకుచద్వయిఁ బూన నభావ మట్లు
నాతియటు గానసుధ యభిన్నంబు కొను, మత్స్వభావంబు గనుటచే మాకు ముద్దు.

క. సర్వద్రష్టను నేనను, గర్వం బిఁక మాకుఁ గలదె కనుపట్టదుగా
సర్వేందువదన మధ్యము, సర్వపదార్థాంతరాళసంగత మయ్యున్. ౨౩౦

---

*నబీద కట్టగసాగన్.

గీ. సత్త్వ మెట్లనఁగూడకున్నను జాననగుము, విష్ణుపదపదము వ్యోమవిషయముపినప
విష్ణుపదపదము వ్యోదు విధము లేదా, సత్త్వ మెట్లనఁగూడదనినవ్వఁ జక్రధరుఁడు.

క. ఘనజఘనకుచపదంబులు, కనవయ్యా గురువులగుచుఁ గమలదళాక్షీ
కన వింత మధ్యపద మిది, కనుపట్టెను లఘువిలాసఘటితం బగుచున్.

సీ. బలుకొప్పు కార్మొగుల్ బాగుగా ధరియించి తులకించువదనచంద్రుని భరించి
గంధిలనిశ్వాసగంధవాహముఁ బూని తనరారుకుచపర్వతంబు లూని
త్వన్మధ్యసంధానితనభంబు గైకొని పంచభూతమయప్రపంచ మూని
సూక్ష్మాతిసూక్ష్మమై చూడ్కికిఁ గనఁగాక మాయాభిరామమై మహిమఁ గాంచి
తనమహాకాశపద మొప్పఁ దనరు నడుము
పరమసూక్ష్మత మనుప విష్ణుపదతఁ గాంచు
నిపుడు మద్దేహసంగతి నెనయు మిగుల
విష్ణుపదభావమని కానఁ బిడికిలించు. ౨౩౩

గీ. వెలఁది లావణ్యరసమహావేణి యందు, బంధురావర్తమై స్వర్ణపద్మమయ్యె
నతిగభీరమహాహ్రదంబయ్యె మెలఁగు, వేడ్కఁ గనుఁగొంటివే నీదు పెడఁదనాభి.

చ. కలితతనూలతం గలవికస్వరనాభిసుమంబులోపలన్
మెలఁగుచునుండి మీఁదటను మేల్వలపుల్ గులుకం దదుద్భవో
జ్జ్వలకుచగుచ్ఛముల్ గొనననవారణమై బయిపెక్కుఁ బిల్లతేఁ
టులజిలిబారునా జిగిఁ గనుం దనరారెడు నారుఁ గంటివే. ౨౩౪

గీ. కాంత యేలోకమునకైన గగనకుసుమ
దర్శనము సేయ నొకఁడైన దక్షుఁ డగునె
యిప్పు డీమింటఁ గనుఁగొంటిఁ దప్పుగాదు
చారుభాస్వరవికసదంభోరుహంబు. ౨౩౫

క. శృంగారరసం బిచ్చటఁ, బొంగదె మధురంపుగుణము పొలుపారఁగ నో
యంగన మధ్యమవృత్తికె, సంగదె మాధుర్యగుణము సంశయ మేలా.

క. పునరుక్తివలెను నుడికిం, గనవయ్యెను నాభి మించు గడురూపము నం
బునరుక్తవదాభాసం, బనఁగ నలంకృతుల నెఱుక నందుట లేదే. ౨౩౬

గీ. పంకజాక్షి యాకరపంకజమ్ము, చౌరఁగఁ దలఁచెను దాఁబరసుభముఁ గోరి
చెలువమీఱెను నిమ్నహాబిలబిలంబు, నవ్యకార్శ్యసమాసక్తి యంత పదలి.

మ. అలమింటన్ సురదీర్ఘికం దెలిగజా *బాల్యాయతాంచత్కరం
బెలమిం జాఁచుచుఁ గ్రీడసేయఁగద కృష్ణేభంబు కాన్పింట నీ
చెలువంపుంబలుదిగ్గియం బ్రమదియై చేసాఁచి క్రీడింపఁగాఁ
దలఁచెం జూడితె యంచు నాభికడకుం దార్చెం గరాంభోజమున్. ౨౪౦

మ. హృదయగ్రంథి మహాదృఢం బగుఁగదా యిప్పట్టు నీడింపఁగా
వదల న్నొకలక్ష్యమా యతనికిన్ భావింపఁగా నంబరా
స్పదమా గ్రంథిత నాస్వభావ మనుచుం బాటిల్లుభీతిం గడుం
జెదర న్నీవి మనోహరాంగి కనుచుం జిత్తంబులో నెన్నఁగన్. ౨౪౧

క. ముడిత్రోడన పడియాటకఁ, గడుసాగెఁ గటి ననంగుకనకాంబరమున్
సుడివాలుదాల్పు ధైర్యపు, ముడి సాకల్యంబుగాఁగ ముద్దుగ జాఱెన్.

ఉ. అత్తఱిఁ జిత్తజుం గనినయట్టిమహాత్ముఁడు రత్నభూషణం
బొత్తు నటంచు నాత్మమృదులోజ్జ్వలచేలచెఱంగు మెత్తనా
మెత్తగఁ జేసి నాఁదిటను మేలిమిబంగరుఁబోఁడిఁ జేర్పఁగాఁ
గుత్తుక పాంచజన్యమునఁగూడినచాయ నొనర్చె నచ్చటన్. ౨౪౩

క. నవ్వుచుఁ బువ్వులతూపుల, గ్రొవ్వుచుఁ బుష్పాయుధుండు గువ్వుచుఁ దిరుగన్
దువ్వుచుఁ గటిపై †పూపుల, రువ్వుచు వెన్నుండు తిగ్మరుచిసుతఁ గనియెన్.

సీ. వివిధరత్నప్రభావిస్ఫురన్మేఖలామాయావిచిత్రత మనుటకతన
సూక్ష్మాతిసూక్ష్మత శోభిల్లుకతమున బహుగుణాశ్రయతచేఁ బరఁగుకతన
నంత(టం) దమరోచు లదరించుకతమున నర్ఘ్యజనంబున నబ్బుకతన
మాలిన్యలేశంబు మలయనికతమునఁ గటినుప్రపంచంబు గ్రమ్ముకతనఁ
దరుణి మామిత్ర మిమ్మహాంబరము గాఁక
దనకుఁ దా విడి మాకుఁ హితం బొనర్చె
మేము చేసినదని గాదు లేమ మాకు
నేర మించుకయును లేదు నీవు గినియ! ౨౪౪

గీ. భామ కర్ణావతంసాదివదములందు, జఘనకాంచినమానగజఘనపదము
గణితమై యున్నదో కాదో కలిమి లేమి,నీ వలంకారవతివిగా నిశ్చయింపు.

క. విరసంబై కనుపట్టెను, సురధునిసికతామయంబు జో డనఁ దగు నీ
వరమాద్యుతసువమారస, మిరవొందఁగఁ గావ నైనయాకటితటికిన్.

---

* బాహ్యగతాంచ † పూపుల

గీ. అతివ కాంచి గుణస్థాన మగుటకతన, నెతదుజ్జ్వ వరదరాడేష్టవాస
మెట్లు గాకుండు నిటవసియించు నట్టి, వరమపూరుషు నతనుతాపంబుగొనున
గీ. చామ యీకటిభూధరచంద్రమునకు, లీల భూచక్ర మంతయు నేలఁజాలు
భాగ్య మొనగూడ గిరిదుర్గపాలనంబు, పులినదేశంబు నేలు టబ్బురముగాదు.
క. ఈ కాళిందినితంబము, జోకై మాక్రీడ నమరఁ జూపెడు మదిలో
నా కాళిందిమనోజ్ఞత, రాకృతిపులినస్థలీవిహారము తెల్లన్. ౨౪౦
గీ. అనదసౌందర్యమై కటి యవహసించుఁ
బ్రాకృతవ్యాకృతిని జిత్రరసముదోఁచు
నొక్కయెడ నద్ది పురుషమత్రయోజ్జ్వలంబు
ప్రథమపురుషైకసంస్పర్శభవ్య మిద్ది. ౨౪౧
గీ. కటిపదంబున *వర్ణసంఘటిత మగుచు, జఘన మభిధకు సాటియా సన్నితంబ
మాత్తవశ్చాన్నిరూఢిమై తుండులకు, నాభిమాత్యంబు దిగాంచి వ్యక్తిఁబోలు.
క. నిరుపమసంభ్రమ మొదవఁగఁ, గరిగామిని కుందితంబు గావింతు నిటం
బరమాహ్వతరస మొదవఁగ, వరవు దలిర్పంగ †నే వివృత మొనరింతుఁగా.
సీ. పొంగుచు నీకటిరంగస్థలంబున లేమ చక్రభ్రమరిం ఘటింతు
ననుమోదభరమున నంబుజలోచన లీల ఛత్రభ్రమరిం దనర్తుఁ
గువలయేక్షణకోర్కిఁ గొనలుసాఁగుచు మీఁఱకుద్వృత్తముసఁజాలనొలపుగాంతు
నురుతరమై రాగ మొదవ నున్నతవేణి రథచక్రచారిత రమణనింతు
నతివ యిట్లు హరిక్రాంత మైయొనంగ, జతనపడుచును వైష్ణవస్థానమై పొ
సంగ‡ వ్యాకృతినొందమఁ జతురవృత్తి, కుటజ నీవేళ నీచేత మెప్పుగొందు.
క. ఈరీతి వచింపుచు హరి, చారుదతీపీనజఘనసంగమమోదా
కారవయోనిధి నీఁదఁగ, నరీతి న్వాఅపులేక యొదమెలఁగంగన్. ౨౪౨
క. ఊరువులందుచుఁ దగ్గత, చారుమృదుత్వంబుఁ గాంచి సరసకదళికా
కారంబు లధికకఠినవి, కారము లని మనసు సౌఖ్యఁగా నిట్లనియెన్. ౨౪౩
గీ. లలన(నీయూరు) యుగళి పేశలతవలనఁ, బరిభవముఁ జెందఁ గదళి కాతరువనంగ
నమ్మొ నచ్చట నమనార్థాంతరంబు, లోకవిభ్రాంతిమూలంబు గాకయున్నె.
గీ. తరుణి యూహాత్తరపదోద్వ్యాధాయకత్వ
మొందు యోగంబునఁ ద్వదూరుయుగళవర్య

---

* వర్ణసంఘటిత † నేలివృత మొనరుతుఁగా. ‡ వ్యాకృతినొందు

దానఁ గనఁదయ్యె ముని త్వరితంబుకతన
నభ్రమే వార్తికోక్తుల నతఁడు గొనెను. ౨౮౯

క. అని యూహద్వయిపొందిక, కనితరసాధార(ణ)ంబు హర్షముగొనుచుం
గనకపుటాల్లి యవేలుపు, కనకాంగిపదద్వయంబు గనుఁగొను చనియెన్.

సీ. అంతజాంఘ(రి)కసద్వృత్తియై మెలంగి, లలితవర్ణోయరీతుల లక్ష్య మగుచుఁ
దళుకులీనునలంకృతధ్వనులఁ దనరి, రమణి సొగసైన యాపదరచన వెలయు.

గీ. హరి! రస్పర్శసంజాతహర్ష విభవ, యతులమృదురూపనీరజాతాధివాస
లక్ష్మి నీపాదముల సేవ లాగుచున్న, దింతకన్నను భాగ్య మిం కేమి నీకు.

మ. అను చంఘ్రిద్వయదర్శనాగతమహాహర్షంబు లోకాళిక
ల్పనసత్యల్పవిలాసతం గొనునిజస్వాంతంబు నాత్మాశ్రయం
బన కెంతేవడి మీఁటి శ్రీధవుఁడు ప్రోయాలిం దగం గాఁగిటం
జెనయం జేసి కుచాంతరం బురము నాశ్లేషించెఁ జెన్నొందఁగన్. ౨౯౨

చ. అతినిశితంపుటగ్రముల నందె కుచల్పనుబొంగరంబు లు
న్నతి మిగులంగఁ దాఁక జిగిఁదప్పదురంబు నురంబు(దాఁ)కినన్
క్షతి యొకయింతలే కడరుచక్కనిగుబ్బలు రెంటిదార్ఢ్యముల్
ప్రతిఁగొన *నొక్కఁడొక్కటికిఁ బాయనిసాక్షులు యుక్తయోగముల్.

సీ. ఘనలసద్వంశములఁబుట్టి జనులొనర్చు, ఛిద్రముల కోర్చి శుద్ధనిర్ణిద్రవృత్తిఁ
జాలరాణిల్లు మేల్ముత్యసరులువిడుచు, సద్గుణంబుల నుద్ధతాశ్రయముకతన.

గీ. అంతరం బగుసార మావంత లేక
బయటఁ దెల్పులు గొన్న యాస్పదముగన్న
నొక్కతటి హాని యగు నని యొప్పఁబలుకు
చతులహా(రా)ళిసూత్రంబు లపుడు విరిసె. ౨౯౪

సీ. ఛిన్నసూత్రంపుముత్యముల్ చేరువేళ, నవ్యనక్షత్రమాలిన్న నవ్వఁ గాను
ముత్యములు నాభిసరసికి మొనయునపుడు, తతవయోధరగళదుదస్రకములయ్యె.

ఉ. కంచుకనామసత్త్వచగర్భగతత్వ మఖండసారభా
వాంచితులైనవారలకు సర్వముగా దని పీడనాడరే
కొంచెపుఁబూఁత తొడగున కూమునె కీర్తులు కార్యవేళ నం
చెంచి కుచంబుపూఁత నెపయించె ననం గడుపీడెఁ బూఁతయుఁ. ౨౯౫

---

*దొక్కడొక్కటికి

క. బలయుతు లన్యోన్యంబును, బలవత్సంఘర్షసేయ బలమతి నడుమన్
మెలఁగెడునది చెడ ననుచుం, దెలుపుమఁ గుచపత్రకాళిదెరలెన్నిగులన్.

మ. పరదుత్కర్షము ఘోరదోషగుణసంబాధాభిజ్ఞత్వసం
గత మాదార్యసుకాంతిముఖ్యగుణసాంగత్యాభిరామంబు నా
నతిచర్చదోయి యలంకృతాన్యమయ్యెన్ సత్కావ్యముం బోలి శ్రీ
పతిచిత్తాబ్జమునం బ్రమోదభర మాపాదించె నంతేనియున్. ౨౧౯

వ. అంత ననంతలీలాపరాయణుం డగు నారాయణుం డమ్మానవతీరత్నంబు నయ
త్నాయత్తాసాధారణాంగ్యాంగలావణ్యం బగిదం బ్రథమపరిదృష్టం బయ్యె
నిదం బ్రథమావలోకనసంపాదితానుపమానకుతుకంబు మనంబునకు *నా
పాదింపం దలంపులో నిబ్బరంపుటబ్బురం బాగుబ్బుకొన నోయలినీలకబరీ
కబరీభారంబున నుదాత్తాలంకారంబును గలితాలికాలకంబున వక్రోక్త్యలం
కారంబును గమలాననంబున వికస్వరాలంకారంబును గన్నుదోయి నుత్ప్రే
క్షాలంకారంబును గలికినాసిక లలితాలంకారంబును గపోలయుగళి జిత్రా
లంకారంబును గర్ణంబులఁ గుండలీబంధాలంకారంబును గన్నుబొమల
దృష్టాంతాలంకారంబును గమనీయాధరంబున రసవదలంకారంబును
గంబుకంఠంబున సత్యుక్త్యాలంకారంబును †గఠినకుంభకుచంబుల ‡శ్లిష్ట
రూపకాలంకారంబును గసద్బాహుల మాలికాబంధాలంకారంబును గర
తలంబులఁ బద్మబంధాలంకారంబును గవ్వనూగారున నాగబంధాలంకా
రంబును గనకచ్ఛాయాంపువళుల విషమాలంకారంబును గౌనుదీఁగె సూ
క్ష్మాలంకారంబును గభీరనాభి నతిశయోక్త్యలంకారంబును గటితటుల
సారాలంకారంబును గరభోపమోరుల రూపకాతిశయోక్త్యలంకారంబును
గాదిలిజంఘల ననన్వయాలంకారంబును గలపదంబుల విరోధాభాసాలం
కారంబును సర్వాంగంబుల సమాలంకారంబును ధరించునించుఁబోఁడివి
గావున నానాలంకారలీలామాలాస్పదంబ వయి వెలుంగెదవు గావున
నను వసువేని సుకమవగుటకు సంశయంబు చాలయంబున నుదయించ
నేర్చునే యనుచు నగుచు నవ్వారాశిజకటులింవిశాలదోరంతరాదో
హం గావించి చాఁప్రొద్దు పుచ్చుకొన ననంతరంబు. ౨౨౦

* నాపాదింప † ఘనకుచంబుల ‡ శ్లిష్టోపమాలంకారంబు

ఉ. అత్తరళాయతాక్షి యసమాయుధపూర్వరణంబు శ్రీకృపా
యత్తునిచిత్త మాత్తకుతుకాతిశయంబునఁ జేసె వ్యక్తిగూ
ఢాత్తచమత్క్రియం బయి యురస్తసుశబ్దవిశేషవాచ్యమై
యుత్తమకావ్యముం బలె సముజ్జ్వలభావరసప్రధానమై. ౨౭౧

క. దయపడుటనో గురుజను లని, భయపడుటనో త్రాంతి నేమి బాణాసకరో
చ్చయములు గనువాడుటనో, కయి నిర్వ్యాపార మయ్యెఁ గదళ్యాతన్.

చ. అలరులవిల్లు నీరసత నందఁగ నాఁకటిచిచ్చు హెచ్చఁగా
*వలియుచు వీడివీడిపడు బంభరపాళి ధనుర్గుణంబుచేఁ
గలుగదు కార్యసిద్ధి యని కంజశరాసనుపీఁచు దత్తఱిన్
విలు గొనకుండఁగా నిడియె వేళమ యానతి కేళిఁదమ్మికిన్. ౨౭౩

సీ. సజలాంబుదంబుఁ జెరకూడి యొదయఁగ [illegible]
హరిమణిస్తంభంబునందు నందము మీఱఁ బూన్చిఁ జెక్కిటిపైఁడిబొమ్మ యనఁగఁ
దనరారు సహకారతరు(వు)తోఁ బెనఁగొంచు లలిమించు మాధవీలత యనంగఁ
బరమకారణ మైన బ్రహ్మంబు నసువున సంగతం బగు చిత్రశక్తి యనఁగఁ
బొలిచెఁ గాళిందినెమ్మేను భువనభయని
వారణాధారణాటోపవాసుదేవ
ఘనభుజాదండసంతతాక్రాంత మగుచు
మించునలయిక వోలయ నిద్రించువేళ. ౨౭౪

గీ. ఏకశయ్యాపదప్రవేశైధమాన,మూర్తు లగుచును దంపతుల్ పొలిచి రపుడు
నేకశయ్యాపదప్రవేశైధమాన,మూర్తు లైనయలంకారములసరణిఁ. ౨౭౫

సీ. చక్రవాకీశోకచటులాంధకారంబు దొలుకఁ గువ్వాతమంబులోడ విచ్చ
సమరమూర్ధన్య†దిగ్రమణీయకాంతితో ఘూకోష్ణనిశ్వాసగుణము హెచ్చెఁ
బంకజామోదసంభవముతోఁ గలువలం దదభావసంభూతి గదియవచ్చెఁ
దరుగతపక్షిసంతతశబ్దములతోడఁ జోరనిశ్శబ్దత సాగియఁజొచ్చె
సకలలోకసదాలోకనాంజనంబు, సారధర్మప్రచారాదికారణంబు
జారసంచారదుర్గ్రహోచ్చాటమంత్ర,రాజ మగుచుఁ‡సుపర్వేళ తేజరిలఁగ.

గీ. సుప్రసాదత సుకవీంద్రసూక్తు లడర,బోధ గైకొని వేగంబ పువ్వుఁబోఁడి
సుప్రసాదత సుకవీంద్రసూక్తు లడర,బోధ వేగంబ చెందుట పోల్కిగాఁగ.

---

* బలలుచు మాఁబడలుచు అనిలడపాఠసమాకి † దిగ్రమణాకుగంబులో ‡ సుపర్వేళ

సీ. చలిగాడ్పుచేఁ దీఁగెబలెఁ జేటనెమ్మేన వలువలు జలజలంజలను రాలఁ
గొప్పు చక్కఁ గుదుర్పుకొనఁ గచకాంతులు పొంత బంగరుజలపోఁత లీన
నిదుర చాలనియట్టినట్టిలోచనంబులు తత్తాలజలజంబుఁ దప్పఁగొనఁగ
మిగిలెడునసురక్తి మగుడిచూడఁగఁ జూచి మదనుండు కాలూన మనసువడఁగ
పాగ్దరస మున్నఁ గాల్యభయంబు నడుకు
నలస యానంబు పాదంబు లడుగు లిడఁగ
నంత యుం తనరాని యాయానపడఁగ
జెడఁగువగలాఁడి వడుకయి ల్వెడలి వచ్చె. ౨౭౯

క. అతిసూక్ష్మాంబరశయ్యా, గతకృష్ణఘనాంగ మెఱసి కమలేక్షణ దా
నతిమందయానమున *రా, నతిభద్రతటిద్విలాస యగుచుం బొలిచెన్.

క. అనలంకృతహావము గొని, వనజాయతనయన యపుడు వఱలె ననంగాఁ
జనదే వస్తువ్యంగ్యం, బనలంకృత మైన మోద మచ్చట లేదే. ౨౮౦

గీ. అతనుభావణవిస్ఫూర్తి నందితోలుత, సుకవుతనూమతల్లి కసాగనుపూడు
నతనుభావణవిస్ఫూర్తి నందకున్న, నతనుభావణవిస్ఫూర్తినలగె నపుడు.

గీ. సుప్రసాదత సద్వ్యక్తి సుభగ యగుచు
ఘనతరాలంకృతిస్ఫూర్తి గొనక మగువ
యుత్తమంపుఁగృతి న్నగు నొక్కవింత
యొక్కయెడ సంస్కృతిచ్యుతి నొప్పి మిగుల. ౨౮౧

సీ. సానవట్టినయట్టి జలజాతబాణుని చేతిమిన్నాహేతిఁ జెనకుదానిఁ
జారుపుంస్కోకిలాస్వాదితం బైనట్టి క్రొమ్మావినిం దప్పి గొనెడుదాని
సంతతరాజహంసక్రీడితం బైనకమలినికై బొమ్మగట్టుదాని
మలయానిలాక్రాంతమర్దనక్లాంత మా సుమశాఖఁ జులుకఁగాఁ జూడుదాని
దననుతఁ జూచి ద్వారంబు దాఁటువేళఁ, దోడినెచ్చెలికత్తెలతోడవచ్చి
బిగ్గఁ గాఁగిటఁ జేర్చుచుఁ బ్రేమ మిగుల, మేలుగాఁ బల్కె నొకవాణి నీలవేణి.

ఉ. కోరిక దీరఁగా మగనిఁ గూడి సుఖించిననిన్నుఁ జూచినన్
మేరకు మీఱుమోదమున మేను సుఖించె మనంబు చింత మా
కూఱడె నీవు సెజ్జకడకుండి కటాకట తోడులేక యీ
ద్వారముదాఁక నిట్టిటకు వచ్చితివమ్మ భయంబు దక్కుచున్. ౨౮౨

---

* పాఠాంతరము

ఉ. అంతట నింతిరోయుస్త నగ వాదన మారుఁగొనంగఁ బల్కె నీ
యంతికిఁ దోడు గావలెన యక్కడ నక్కడనుండి రాఁగనా
వంత భయంబు లోఁగొనక యాత్మవిభుం డనుదంచ నీనిశం
గంతుమురంబుఁ జేసి భయగాయము లందినమేటి గావునన్. ౨౮౫

ఉ. అప్పుడు నీలవేణి చలియుందవుఁ జేష్టలు మానఁగోరి యో
యొప్పులకుప్ప నీకుమది కొప్పగ జేఁ దలపూన్చిఁ బూనెనే
తప్పక చెప్పు మన్న నగుఁదాల్చుట సిగ్గున మోముఁ వాంచుటా
జెప్పను వాతి యంతరము చిన్నలు చెప్పఁగఁ జానయుక్తిగన్. ౨౮౬

వ. ఇట్లు కాళిందీయిళిందదిమురం గరగ్రహణంబుచేసి యనంతరంబ మిత్రవిం
దాముందరదనం బౌండ్లియాడి నాగ్నజితీమానవతిం జెట్టవట్టి భద్రాభద్రే
భయానం గాలుద్రొక్కి మద్రరాజన్యకన్యక నైనలక్షణం బొట్టుగట్టి
యష్టమహిషీనయనచకోరకరద్రాకానిశాకరుండై యక్కటటయానవవ
దుండు పిదప నరకాసురుం ద్రుంచి [యింద్రలోకంబునకుం జని యదితిచేఁ
గుండలంబులు గొని పారిజాతనగంబు సంగ్రహించి నరకుం ద్రుంచి] తత్కా
రాగృహనీతషోడశసహస్రరాజకన్యకల నాత్మకరగ్రహణంబున ధన్యలం
గావించి తద్భావతనిరంతరప్రమోదాపాదనదక్షుండగుచు దక్షుండై
ధీరలలితనాయకోత్తముం డనవెలయుచు మునులకుఁ దపఃఫలం బై యరి
నీకులకుఁ గృతాంతుండై యర్థులకుం జింతారత్నంబై ధనుర్ధరులకు వీరా
గ్రసరుండై విద్యార్థులకుఁ బరమాచార్యుండై గాయకులకు వాగ్గేయకా
రశిరోరత్నంబై శరణాగతులకు వజ్రపంజరంబై విదగ్ధులకు (ర)సికావతంసం
బై మదవతులకు నభినవమదనుండై సంఖ్యావంతులకు శాస్త్రవేత్తయై
నటులకు హల్లీసకతల్లజుండై కర్షకులకు నమస్తాత్మప్రకాండుండై తత్త్వవా
దులకుం బరమతత్త్వంబై యోగీంద్రులకు లక్ష్యంబై (రస)వాదులకు జగ
దేకరసంబై సుగుణవాదులకు నుపాస్యంబై భాసిల్లుచుండ నయ్యవ
సరంబున. ౨౮౭

సీ. *శాస్త్రంబు గతి నమస్తావకత్వవిలాసభాసురంబై చాల వాసిగాంచ
దా(హారరో)దారదవకేలి పంథ్యాకుమారునితోఁ బొందు గోరుకొనిము

---

[ ] ఈ నడిమివాక్యము సంపర్భశుద్ధిగా లేదు *శాస్త్రంబులీల.

దారిద్ర్యఖేదసంధానంబు గగనమండలపుండరీకంబు చెలువు మీఱ
కళమృగంబుకరంబు చక్రక్రోక్తి మెలంగు కొమ్ము స(ద్ధ)ర్త మిమ్ముచేసి
నవనినాథా! గోపాల మఖిలజనుల, నలువుమిగులంగ బ్రాపించనవరసముల
నలప్రసాదంబుపొందె మనసనువుగాఁగ, నతులసౌఖ్యంబుచూచుచులరుదుగనఁగ.

ఉ. మంగళ మంగజాతరిపుమంజులమానసమధ్యవర్తికిన్
మంగళ మబ్జ(జ)ప్రముఖమానితదైవతచక్రవర్తికిన్
మంగళ మానతార్తికృదమంగళభంగదసారకీర్తికిన్
మంగళ మాదిమూర్తికి ఘనప్రథమూర్తికి రామమూర్తికిన్. ౨౮౯

గద్యము.

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిందాంతఃకరణ పోలూరి మాధవ
యజ్వసముజ్జ్వలత్త్రైపౌత్రికటాక్షప్రసాదితపాండిత్యాభరణ ప్రథం
జనవంశాబ్ధిరాకాశశాంక నిరంతరారాధిత విచక్షణ శశాంక
అభినవనన్నయభట్టారక మహాబల పత్యాహ్వయ
కవిమహోపాధ్యాయభట్టారక విరచితం
బైనకాళిందీకన్యాపరిణయం బను
మహాప్రబంధంబునందు
సర్వంబును షష్ఠాశ్వాసము.

---

ద్వితీయభాగము సంపూర్ణము.

---

అఖిలభూతచయము లణఁగి మాయనుజేరె, నదియు నా కనన్య యయ్యె ననెడి
జ్ఞప్తియుంట తానె జ్ఞానరూపుండురా, పటు. ౨౭

వలిసభవసురేంద్రనరతిర్యగాదుల, సుఖములును దదీయసుప్తిసుఖము
లంత మగుటఁ దా ననంతరూపుండురా, పటు. ౨౮

అట్లశ్రోతయాప్తిశానుభూతులను స, త్యాదిలక్షణాత్ముఁడై ప్రమేయుఁ
డగుచువాస్తవము న యప్రమేయుండురా, పటు. ౨౯

అప్రమేయుఁడైన యమ్మహాపురుషుండు, కలిగి లేని దొక్క కాంత నెనసి
పుట్టి చచ్చుజనులఁ బుట్టించె వినుమురా, పటు. ౩౦

అప్రమేయునం దనాదిగా నొకశక్తి, గలదు మున్న త్రిగుణకలిత యగుచు
దానిఁ బ్రకృతియనుచుఁ దత్త్వజ్ఞు లండ్రురా, పటు. ౩౧

మట్టివిత్తునందు మట్టిచెట్టున్నట్లు, మంటిలోన ఘటము మలయునట్లు
ఆత్మనందుఁ బ్రకృతి యాలవడి యుండెరా, పటు. ౩౨

విపులయందుఁ బెక్కువిత్తనం బున్నట్లు, విత్తనున్న పెక్కువిత్తులట్ల
ప్రకృతియందు జీవపటలంబు లుండురా, పటు. ౩౩

ఆపురాణపురుషుఁ డాజీవపటలమ్ము, తోఁప మాయయగుచుఁ దోఁచెఁ బ్రకృతి
అమలరూప మెద్ది యదియపో మాయరా, పటు. ౩౪

ఇదియు నదియు నట్టి దిట్టి దింతంతని, యెఱుఁగరాక నదియు నిదియు నిట్టి
దట్టి దంత యింత యనెడిదే మాయరా, పటు. ౩౫

కారణమునఁ దోఁచు కార్య మాకారణ, మణఁచినట్టు లాత్మయందుఁ దోఁచి
యాత్మ నణఁచు నెద్ది యదియె పో మాయరా, పటు. ౩౬

స్థాణువునరుండు త్రాట భుజంగంబు, దొరసి మింట నలుపు దోఁచినట్టు
లాత్మ నెద్ది తోఁచు నదియుపో మాయరా, పటు. ౩౭

యువతిగర్భమందు నుంచినరేతంబు, అవయవాన్వితాంగ మైనయట్టు
లఖిలజగము లెద్ది యగు నదే మాయరా, పటు. ౩౮

పృథివిలోనఁ గలయుబీజంబులెల్లను, పృథులతిక లగుచు వెలసినట్టు
లఖిలజీవు లెద్ది యగు నదే మాయరా, పటు. ౩౯

తన్నుఁగనని వానిఁ దన్నుగాఁ గావించి, తన్నెఱుంగువానిఁ దన్నుఁ జేసి
యాశ్రయించు నెద్ది యదియపో మాయరా, పటు. ౪౦

ఆత్మ నుండకున్న నాత్మ నెగ్గకయున్న, నాత్మ నలరకున్న సజ్జనుల
నావరించు నెద్ది యదియపో మాయరా, పటు. ౪౧

తాను గలిగియున్నఁ దానెఱుంగుచునున్నఁ, దానుమఱియుచున్నఁ దజ్ఞజనుల
నాక్రమింప దెద్ది యదియపో మాయరా, పటు. ౪౨

తనదుకలిమి లేనితనువునఁ దన తెల్వి, గాని మదిని దనసుఖంబు పోని
యాలిఁ జేర్చునెద్ది యదియపో మాయరా, పటు. ౪౩

కల దనంగఁ దన్నుఁ గనఁబోవు లేదనఁ, గలదు సజ్ఞదృష్టిఁ గలిగి లేని
దనఁగరాదు దేని నదియపో మాయరా, పటు. ౪౪

ఆత్మదృష్టి ననృత మగు నవాచ్యము యుక్తి, దృష్టినగుచు లౌక్యదృష్టిచే న
నంత మయ్యె నెద్ది యదియపో మాయరా, పటు ౪౫

మాయకాత్మవశత మహదహంకారత, న్మాత్రభూతభువనగాత్రవితతు
లగుచుఁ దనకుఁ దనువు లై యుండె వినుమురా, పటు. ౪౬

మాయ యనెడి దొక్కమూఁకని యది పఱి, శుద్ధరాలు నవిశుద్ధరాల
నంగ మించి యిరువిధాంగనలైరిరా, పటు. ౪౭

ఆపరాత్మఁ డందు నాశుద్ధశక్తిని, నాశ్రయించి యీశుఁ డయ్యె నతఁడె
మలినశక్తి నెనసి మఱి జీవుఁ డయ్యెరా, పటు. ౪౮

ఘనత సుప్తిహేతుగతి నీశ్వరుఁడు స్వప్న, సూక్ష్మదేహగతిని సూత్రిజాగ్ర
దన్నగతి విరాజుఁ డై యీశుఁ డుండెరా, పటు. ౪౯

వ్యష్టి సుప్తి బీజదృష్టిఁ బ్రాజ్ఞుఁడు స్వప్న, సూక్ష్మదృష్టిఁ దైజసుండు జాగ
రాన్నదృష్టి విశ్వుఁడై జీవుఁ డుండెగా, పటు. ౫౦

శుద్ధరాలు తన్నుఁ జూచి క్రీడించిన, వాని నీశు నింకఁ దాను మూఁడు
దెర్లఁబనుచు మూఁడుతిప్పలఁ బెట్టురా, పటు. ౫౧

రజము మదిఁ బెనంగ రాజసాంగన తన్ను, వలచియున్న బొమ్మ వాయిగట్టి
భువి నశించుజనులఁ బుట్టింపఁ జేసెరా, పటు. ౫౨

సత్త్వ మెదఁ బెనంగ సాత్త్వికాంగన తన్ను, నమ్మియున్న చక్రిఱొమ్ముఁద్రొక్కి
పుడమిఁ బొడమ జనులఁ బోషింపఁ జేసెరా, పటు. ౫౩

కేవలాత్మఁ డిల్లు జీవేశు లనఁ శక్తి, భేదకల్పనమున భిన్నుఁ డయ్యె
వాస్తవమున నాత్మవస్తువే యొకటిరా, పటు. ౫౪

తమము మతిని గతుకఁ దామసాంగన తన్ను, నేరయుహరుని సగము నొడలుచేసి
ధరణి మఱియు జనుల దండింపఁ జేసెరా, పటు. ౫౫

ఉభయదేశకాలయుతమర్త్య నొకనిఁగా, నుండఁజూచుపగిది నుభయవాచ్య
    లక్షణములఁ ద్రోయ లక్ష్యార్థ మొకటిరా, పటు. ౫౬.

ఘటశరావములను ఘటమతంబులఁద్రోచి, మన్ను మిన్ను నొక్కటన్నపగిది
    జీవభావరహితజీవేశు లొకటిరా, పటు. ౫౭

వాస్తవములు గాని వాచ్యార్థములు రెంటి, మఱచిచూడలక్ష్యమయములగుచుఁ
    బరఁగు ప్రత్యగాత్మపరమాత్మ లొకటిరా, పటు. ౫౮

ఘటఘటోదకములఁ గడవఁ దక్కులరహి, తార్థ మొక్కటైనయట్లు నుభయ
    దేహధీఫలవ్యతీతాత్మ లొకటిరా, పటు. ౫౯

తనువుగానితాను త్వంపదార్థము విశ్వ, తతులుగాని తాను తత్పదార్థ
    మసిపదార్థ మాపరాత్మైక్య మగునురా, పటు. ౬౦

మింటవలపు దోఁచి మిడుగన వలపులే, నట్టు తాను జీవుఁడగుచుఁ దన్నుఁ
    దెలియ జీవగతులు దొలఁగి తా నయ్యెరా, పటు. ౬౧

ఇట్టు వాక్యరూప మేను గా ననిత్రోసి, వెలసి తన్నుఁదెలియు వెరవు నీకు
    విస్తరించి తెలియ వినిపింతు వినుమురా, పటు. ౬౨

ఆలు మగఁడుఁ దిన్నయన్నంబువలనను, సురతజనితరక్తశుక్లములను
    గూడి మొదల నన్నకోశమై యుండురా, పటు. ౬౩

అన్నమయములోన నైదుప్రాణంబులుఁ, గరపదాదికర్మకరణములును
    మమతఁ గూడి ప్రాణమయకోశ ముండురా, పటు. ౬౪

ప్రాణమయములోనఁ బ్రబలమై శ్రోత్రాది, జ్ఞానకరణచిత్తమానసముల
    మలయుచున్న హృదయమయకోశ ముండురా, పటు. ౬౫

అమ్మనోమయాంతరమ్మున శ్రవణనే, త్రాదికరణబుద్ధ్యహంకృతులును
    మహితమైన బుద్ధిమయకోశ ముండురా, పటు. ౬౬

మఱి యువాప్రబుద్ధిమయకోశమునఁ బ్రియా, ద్యఖిలవృత్తిసహిత మై తమోమ
    యాత్మకమున నుండు నానందమయమురా, పటు. ౬౭

ఆప్రియాదిసంయుతానందమయములో, నాత్మఁ దుండు వాని పరయ కాత్మ
    కోశమయుఁ దటంచుఁ గొలుతు రెట్లన విను, పటు. ౬౮

పుట్టిపెరుఁగుచుండు బొంది తా నని కొంద, ఱందు రదియుఁ దెలియ కనుటగాక
    తాను వెడలఁ గాల్చుటను వెట్టు లాత్మరా, పటు. ౬౯

బ్రదికి కుడువ మొదలు ప్రాణ మాత్మగాఁ గొంద, ఱందు రదియు నెఱుఁగఁ గనుటగాక
పట్టు వదలఁ బోవు ప్రాణ మెట్లాత్మగా, పటు॰ ౨౦

చేటుపాటుఁ దెలుపు చిత్త మాత్మగాఁ గొంద, ఱందు రదియుఁ గాన గనుట గాక
చెప్పినట్లు వినని చిత్త మెట్లాత్మరా, పటు॰ ౨౧

నేను నాఁ దనుమనీష యాత్మగాఁ గొంద, ఱందు రదియుఁ జూడఁ గనుట గాక
నిద్ర నణఁగఁగల మనీష యెట్లాత్మరా, పటు ౨౨

సుప్తి నెలవుగలుగు శూన్య మాత్మగాఁ గొంద, ఱందు రదియు నరయఁ గనుటగాక
చూడ లేని సర్వశూన్య మెట్లాత్మగా, పటు॰ ౨౩

సుప్తి నందఁబడెడు సుఖ మాత్మ యని కొంద, ఱందు రదియు నేర గనుటగాక
తెలియఁగరాని సౌఖ్య మెట్లాత్మ యగునురా, పటు ౨౪

అణువుమధ్యమము మహాత్ముఁ డాత్మని కొంద, ఱందు రదియుఁ జెద గనుటగాక
ఆత్మ నిర్వికారుఁ డదియుఁ దా నెట్లుగా, పటు॰ ౨౫

చిన్మయుండు మఱియుఁ జిన్మయుండును జివ, చిన్మయుం డటంచుఁ జెప్పికొంద
ఱందు రగుణుఁ డాత్ముఁ డదియుఁ దా నెట్లురా, పటు. ౨౬

పంచకోశములకుఁ బయిన కిట్లనోన్యన్య, మేకవృత్తి యగుట నేర్పటించి
లోన నున్న తను విలోకింపవలయురా, పటు. ౨౭

గృహగృహాంతరార్థకృత్యాద్యతీతుని, కరణి దేహదేహకలితమారు
తాత్మమతితమోమయాతీతుఁ డాత్మరా, పటు॰ ౨౮

గృహములోనివాఁడు గృహముతాఁ గానట్లు, తనువులోనివాఁడు తనువుగాక
తనువు నెఱుఁగుచుండు తా నని యెఱుఁగరా, పటు॰ ౨౯

కన్నులోనివాఁడు కన్ను తాఁ గానట్లు, గాలిలోనివాఁడు గాలిగాక
గాలి నెఱుఁగుచుండు ఘనుఁ డని తెలియురా, పటు॰ ౩౦

రథములోనివాఁడు రథము తాఁ గానట్లు, మనములోనివాఁడు మనము గాక
మనము నెఱుఁగు బోధమయుఁ డని తెలియురా, పటు॰ ౩౧

శయ్యలోనివాఁడు శయ్య తాఁ గానట్లు, ప్రజ్ఞలోనివాఁడు ప్రజ్ఞగాక
ప్రజ్ఞ నెఱుఁగుచుండు ప్రాజ్ఞుండె తానురా, పటు॰ ౩౨

కోటలోనివాఁడు కోట తాఁ గానట్లు, ప్రకృతిలోనివాఁడు ప్రకృతిగాక
ప్రకృతి నెఱుఁగుచుండు ప్రభుఁడని యెఱుఁగరా, పటు॰ ౩౩

సాఘటంబు సాధనం బనువాఁ డవి, యేమి గాని పగిది సాధనంబు
    సాశరీర మనెడుఁ దా శేషభూతుండు, పటు. ౮౪

తనువు గాఁడు మారుతము గాఁడు కరణము, ల్గాఁ డు హృదయమతులు గాఁడు కాఁడు
    కాఁడని యెఱుఁగు వాఁడె గనువాఁడె తానురా, పటు ౮౫

తెలుపు నలుపుఁ బసుపు లు పాకఁ బసరుపు, కొద్దిగొప్పపొడవు కుఱుచ వాఁడు
    గాఁడు వాని నెపుడుఁ గాంచెడివాఁడురా, పటు. ౮౬

వినెడువాఁడు స్పర్శగొనువాఁడు రూపంబు, గనెడువాఁడు రుచులఁ గొనెడువాఁడు
    తావిగొనెడువాఁడుఁ దానని యెఱుఁగరా, పటుగు. ౮౭

పలుకులొల్లువాఁడు బనులు చేసెడువాఁడు, నడుచువాఁడు మలము విడుచువాఁడు
    తగ సుఖించువాఁడుఁ దా నని యెఱుఁగరా, పటు ౮౮

ఛిద్రఘటములో వసించెడి దీపంబు, వెలివి లోఁ వెల్లఁ దెలుపునట్లు
    తనువులోననున్న తా నన్ని తెలియురా, పటు. ౮౯

తమ్ము నెఱుఁగలేని తనుకరణాదులు, నాత్మ నెఱుఁగనేర వశట నిజము
    వానిఁ దా నెఱుఁగువాఁ డని తెలియురా, పటు ౯౦

కమలమిత్రుఛాయ గనిపెట్టి కమలము, వనుల మొదలు నరులకగిదిఁ దన్ను
    సంశ్రయించి హృదయచక్షువు త్మెలఁగురా, పటు ౯౧

చుంబకంబునంటి సూదులాడినయట్లు, దారముగొలిచి భటులు దిరిగినట్లు
    ఆత్మ నంటి యింద్రియంబులు దిరుగురా, పటు ౯౨

తప్తలోహమందు దహనుండు నున్నట్టు, లొడలిలోన జీవుఁ డుండి మెలఁగు
    జీవునందు నిండి చిన్మయుం డుండురా, పటు. ౯౩

* యండమావు లుదకమైనట్లు తాజీవుఁ, డయ్యె నండమావు లరయ జలము
    గాని యట్లు తన్నుఁ గన జీవుఁ డేఁడిరా, పటు. ౯౪

ఘృతముగలిగియుంట క్షీరంబులనుదీపి, గుడము కలిమిఁ జెఱకుగడలు తీపి
    † తాఁగలింగియుంటఁ దనువుభోగ్యంబురా, పటు. ౯౫

కలశవికృతు లెల్లఁ గలశప్రకాశార్థుఁ, జేరనట్లు తనువికారములను
    దనువులోననున్నత న్నంటకుండురా, పటు. ౯౬

శ్రుతులు లేక రవము శ్రుతమునొందెడువాఁడుఁ, దనువు లేక స్పర్శగొనెడువాఁడు
    గనులు లేక రూపు గనువాఁడు తానురా, పటు. ౯౭

---

* యండమావులని యకారాదిగా వాడినాఁడు. †కలింగియని బిందుపూర్వకముగా వాడెను.

రసనలేక రుచులు మెసఁగుచుండెడువాఁడు, నాసలేక తావి *మేయువాఁడు
మనములేక తలఁపు గొనువాఁడె తానురా, పటు. ౯౮

వినిన వినును గనినఁ గను సోఁక సోఁకు మూర్కొనిన మూరుకొనును ననుభవింప
ననుభవించు నెవ్వఁ డతఁడె తా నయ్యెరా, పటు. ౯౯

పలుకఁ బలుకు మెలఁగ మెలఁగుఁ దొలఁగినఁ, దొలఁగు నడువనడుచు దలఁప దలఁచు
పరయనరయు నెవ్వఁడతఁడె తానయ్యెరా, పటుగుణాభిరామ పరశురామ ౧౦౦

ఉండఁజోటులేక నునికియు భోగ్యవ, స్తువులులేక తృప్తి సుదతిపొందు
గాకసుఖము దేనఁ గలదదే తానురా, పటుగుణాభిరామ పరశురామ ౧౦౧

కానరానివానిఁ గాంచెడివాఁడును, బలుకరానివానిఁ బలుకువాఁడుఁ
దలఁపరానివాఁడుఁ దానని తెలియురా, పటు. ౧౦౨

తెలియరానివానిఁ దెలిసెడివాఁడను, మఱవరానివాని మఱచువాఁడ
నెఱుఁగరానివాఁడ నేనని తెలియురా, పటు. ౧౦౩

వీనులను గలింగి వినియెడివానిని, వీనులను దొలంగి విననివాని
నొకనిఁగా నెఱుంగుయోగంబె తానురా, పటు. ౧౦౪

తనువునసి స్పర్శగొనియెడివానిని, దనువులేక ముట్టుకొననివాని
నొకనిఁగా నెఱుంగుయుక్తియె తానురా, పటు. ౧౦౫

కనులఁగూడి రూపుగనుఁగొనువానిని, గనులులేక యేమి గననివాని
నొకనిఁగా నెఱుఁగునూహయే తానురా, పటు. ౧౦౬

రసననసి రుచుల మెసఁగెడివానిని, రసనలేక మెసఁగరానివాని
నొకనిఁగా నెఱుఁగుయుక్తంబె తానురా, పటు. ౧౦౭

వాస పలరి తావి వాసించువానిని, వాసలేక వాసనానివాని
నొకనిఁగా నెఱుఁగునుచితంబె తానురా, పటు. ౧౦౮

శ్రోతయగుచు ధ్వనుల శ్రుతమునొందినయట్లు, వినఁగఁబోవఁ దానువినఁగఁబడక
శ్రోతృభావరహితసూత్రంబె తానురా, పటు. ౧౦౯

స్ప్రష్టయగుచు స్పర్శసంస్పృశించినభంగి, సోఁకఁబోవఁ దాన సోఁకఁబడక
స్ప్రష్టృభావరహితసారంబె తానురా, పటు. ౧౧౦

భోక్తయగుచు రుచులు భుజియించురీతిని, మెసఁగఁబోవఁ దాను మెసఁగఁబడక
భోక్తృభావరహితభోగంబె తానురా, పటు. ౧౧౧

* మేయునది మేయు.

ద్రష్టయగుచుఁ గళల దర్శించుచైవడిఁ, జూడఁబోవఁ దాను జూడఁబడక
ద్రష్టృభావరహితసత్త్వంబె తానురా, పటు. ౧౧౨

ఘ్రాతయగుచుఁ దావిగ్రహియించుపగిది మూ, ర్కొనిన తాను మూరుకొనఁగఁబడక
ఘ్రాతృభావరహితగమ్యంబె తానురా, పటు. ౧౧౩

మంతయగుచుఁ దలఁపు మననంబుగొనుభాతిఁ, దలఁపఁబోవఁ దాను దలఁపఁబడక
మంతృభావరహితమననంబె తానురా, పటు. ౧౧౪

జ్ఞాతయగుచుఁ దెలివి జ్ఞప్తిగైకొన్నట్లు, తెలియఁబోవఁ దాను దెలియఁబడక
జ్ఞాతృభావరహితజ్ఞానంబె తానురా, పటు ౧౧౫

దృశ్యమర్థములును దృక్కులక్షులవి, దృశ్యమైనమనము దృక్కుమనము
దృశ్యమైనవాత్మదృక్కది తానురా, పటు. ౧౧౬

తెలియఁబడెడిదెల్ల దృశ్యంబు దానిని, దెలియుచుండువాఁడు దృక్కు వాని
దెలియుదృక్కుమీఁదఁ దెలియంగ లేదురా, పటు. ౧౧౭

తన్నుఁ దెలియ దృక్కు తిదనాత్మయననది, తెలియ బసుచుఁ దన్నుఁ దెలియునట్లు
దీపభాస్యఘటము దీపంబు నెఱుఁగునా, పటు. ౧౧౮

తన్నుఁ దెలియుదృక్కు తనకునుదక్కువై, తెలియు ననిన నదియుఁ దెలియునట్లు
స్వల్పదీప మెఱిఁగి సవితృని దెల్పునా, పటు. ౧౧౯

తన్నుఁ దెలియు దృక్కు తనకు సమానమై, తెలియు ననిన శ్రుతులఁ గలుగ దదియు
దీప మాత్మసదృశదీపంబు నెఱుఁగునా, పటు. ౧౨౦

తన్నుఁ గాంచుదృక్కు తనకెక్కువై తను, గాంచు ననిన దానిఁ గాంచునొకటి
యనుచుఁ బెక్కు లగుట ననవస్థ వచ్చురా, పటు. ౧౨౧

కాన దృక్పరంపరానువృత్తులనెల్లఁ, దోలఁగఁ ద్రోసి వానిఁ దెలియు మొదలి
దృక్కు నే నటంచుఁ దెలియంగ వలయురా, పటు. ౧౨౨

ప్రకృతిభూతములును బ్రాణంబులును నింద్రియములు మనము బుద్ధ్యహంకృతులును
నాఁగ నిరువదియును నాలుగు క్షరములు, పటు. ౧౨౩

తుదిక్షరుండు తచ్చతుర్వింశకుండు ప, రుండు పంచవింశకుండు తత్ప
రాత్ముఁ డక్షరాక్షరవిలక్షణుండురా, పటు. ౧౨౪

సత్య మక్షరం బసత్యంబు క్షరమును, జిత్తు నక్షరం బచిత్తు క్షరము
సౌఖ్య మక్షరం బసౌఖ్యంబు క్షరమురా, పటు. ౧౨౫

ఆయసంజ్ఞఁ డాసుఖాత్మకతురము దా, గాక సత్యచిత్సుఖాత్మకాత్ము
 రాత్మకుండ నేన యని కనవలయురా, పటు. ౧౨౬

అనిమేష మాది యగు లయాంతంబుగాఁ, గలుగుభూతభావికాల మరుగ
 నరుగకుంట దాన యగునస్తయుండురా, పటు. ౧౨౭

కాయమనిలమూలును గరణంబులుకు మనో, మతు లవిద్య పెక్కుమనసిపోవ
 సమయకుంటఁ దాన సద్రూపకుండురా, పటు ౧౨౮

ఇవి ఘటాదు లివిహ్యాది క్రియాదులు నివి, వృత్తు లనుచు నెఱిఁగి వెలిని లోనఁ
 జెలఁగుచుంటఁ దాన చిద్రూపకుండురా, పటు. ౧౨౯

తెలియఁజేయ నస్యధీవత్తువులు లేక, వెలుఁగఁజేయ నొండు వెలుఁగు లేక
 చెలఁగి వెలుఁగు తాన చిద్రూపకుండురా, పటు ౧౩౦

సుఖముగలుగఁజేయు సుమగంధములు లేక, శయ్యనొరగి కూడ సతులు లేక
 సుఖము గొనుట తాన సుఖరూపకుండురా, పటు. ౧౩౧

ఆలుబిడ్డ లర్థ మాదిగాఁ గలవెల్లఁ, బ్రియము లగుచుఁ దనదు ప్రియమువలనఁ
 జూడఁబడుటఁ దాన సుఖరూపకుండురా, పటు. ౧౩౨

కంజభవుఁడు మొదలుగా స్తంబపర్యంత, మగుచరాచరములయందు నిండఁ
 బోలి నిండియుంటఁ బూర్ణుండు తానురా, పటు. ౧౩౩

అట్టి పూర్ణసచ్చిదానందమయుఁడ నే, నని యెఱుంగు పారమార్థికుండు
 అమృతపదవి నొంద నమనస్కుఁ డయ్యెరా, పటు. ౧౩౪

విషయములఁ గదల్చి వివిధాత్మముల మల్చి, మనముతోడఁ గల్పి మదిమరల్చి
 యాత్మ నిల్పి తాన యమనస్కుఁ డగునురా, పటు. ౧౩౫

మనమె దేహకరణమహదహంకృతులును, మనమె రాగరోషమత్సరములు
 మనమె విషయములును మనమె కర్మములురా, పటు. ౧౩౬

మనమె జాగరంబు మనమె స్వప్నంబును, మనమె సుప్తియును సమాధి మనమె
 మనమె మీరు మేము మన మనుతలఁపురా, పటు. ౧౩౭

మనమె జీవకృతసమస్త సంసారంబు, మనమె యీశకృతసమస్తజగము
 మనమె యుభయకృతసమస్తధర్మములురా, పటు. ౧౩౮

ఇంతయేల మనమె యీశులు జీవులు, భువనభవనభాగ్యభోగ్యములును
 పటఘటాదు లన్నపానముల్మనమెరా, పటు. ౧౩౯

మనము గలియఁ గరణమండల మనిలనం, వర్తి విషయములకుఁ బరువువెట్టు
 మనము గలియకున్న మాఱి సుప్తి నణఁగురా, పటు. ౧౪౦

మనమనంగ నల్పమయి మది సంకల్ప, మదియు లేమ హరిపదాబ్జ మట్లు
అట్టి మనము లేమి యమనస్క మగునురా, పటు. ౧౪౧

లేనిమనముచెలిమి తా నభిమానించి, వేఱె తలఁపుగొనుట వెఱ్ఱితనము
శుక్తిఁ దోఁచు వెండి సొమ్మయి నిలుచునా, పటు. ౧౪౨

ఉన్నరీతిఁ దన్నుఁ నుండఁగాఁజూచిన, లేనిమనముతోనె లేకపోవుఁ
త్రాడనెఱుఁగఁ బాము తథ్యమై నిలుచునా, పటు. ౧౪౩

తెలివియైనతన్నుఁ దెలివిగాఁ దెలిసినఁ, దెలివిగానిమనము తొలఁగిపోవుఁ
దపనుఁ డుదయమొందఁ దమము చూపట్టునా, పటు. ౧౪౪

సుఖమయైనతన్ను సుఖముగా నెఱిఁగిన, దుఃఖరూపమనము దోఁపకుండుఁ
దొడరి సుప్తియందు దుఃఖంబు గల్గునా, పటు. ౧౪౫

హరిపదాబ్జమునకు హరిపదంబునకు నా, దగుల మెన్నఁజేసి దగనియట్లు
తనకు మనమునకును దాదాత్మ్యమున్నదా, పటు. ౧౪౬

కాఁడు నెఱుఁగనరుఁడు గుఱిపడకున్నట్లు, నింగి నెఱుఁగ నలుపు నిలువనట్లు
తన్నెఱుంగ మనము సున్నగాకుండునా, పటు. ౧౪౭

ఎన్నలేనిమనము నున్నదన్నది సున్న, కన్నతల్లిఁగల్ల యెన్నఁదున్న
తన్ను విన్నఁ గన్న మన్న మేలెన్నరా, పటు. ౧౪౮

లేనిమనము నెపుడు లేకుండఁగనుదన్నుఁ, దానవికృతులెట్లు తగిలివచ్చుఁ
గలను గన్నపాము గఱచ నేమయ్యెరా, పటు. ౧౪౯

సుమరసంబుగ్రోలి సొక్కెడుభృంగంబు, చంపకంబు సోఁకసమయుభంగిఁ
దన్నుఁ గనిన మనము తనయందె సమయురా, పటు. ౧౫౦

పాలలోనఁ గలయు *పందార కైవడి, నుదకమందుఁ గలియు నుప్పురీతిఁ
దన్నుఁగనినమనము తా నయిపోవురా, పటు. ౧౫౧

ఇంధనములు లేనియింగలంబును తను, దా కృశించుకరణిఁ దన్నుఁ గన్న
వానిమనము తనకుఁ దానె కృశించురా, పటు. ౧౫౨

శిఖిని జూచి యణఁగు చిలువలకైవడి, హరిని జూచి ప్రగ్గుకరులయట్టు
లాత్మఁగని హృదింద్రియము లూరకుండురా, పటు. ౧౫౩

స్వానుభవవిచారసంపత్తి లేకున్న, మనసు ప్రగ్గ దదియు ప్రగ్గకున్న
స్వానుభవవిచారసంపత్తిలేమురా, పటు. ౧౫౪

* పంచదారయనుటకు "పందార"

కోరి నభమునకును గుండేటికొమ్మునకు, బొందులేనియట్లు పూర్ణుఁడైన
 తనకు మనమునకును బాహ్యాత్మ యుండునా, పటు. ౧౫౫

ఉప్పు నీటఁ గలిపి యొకట నెంటను మూటఁ, నగ్నిగురవేయ మగ్గినట్లు
 లాత్మ నెఱుఁగ మనసు నంతరించి కరఁగురా, పటు. ౧౫౬

తప్తలోహపతితాంబుబి దువృథంగి, స్వానుభూతి మగ్నశాంతిపరుని
 మానసంబు తనకుఁ దాని క్రమ్మరించురా, పటు. ౧౫౭

వెండి పైఁడి యినుము విఱుఁగఁ దత్కారకు, లంటఁగాఁచి మరల నదికినట్లు
 మనసువిఱిగిపోవ మఱియత్తకుండురా, పటు ౧౫౮

వేయుఁ జెప్పనేల విఱిగిన కాష్ఠంబు, మరలనంటుకొనని మూర్ఖి మనసు
 విఱిగిపోయెనేని మరలంటకుండురా, పటుగుణాభిరామ పరశురామ(పరాం)

ఆత్మ తానయైన యంతిలోఁదలుఁకున, మనసు విఱుగు నట్లు మనసు విఱుగ
 నది మహామనస్స మదియుఁపో ముక్తిరా, పటు. ౧౫౯

అఖిలమునకు హేతువగు మది మడికిని, మాయ హేతు వగు నమాయ నెఱుఁగ
 మాయతోడ మనసు మాయమై పోవురా, పటు. ౧౬౦

మాయ మాయలాఁడి మాయకంటెను మది, అంకులాఁడి దాని బింకమణఁచ
 మంత్రతంత్రయోగ మహిమలు గావురా, పటు. ౧౬౧

మఱపు వెఱపుఁజేయు మాయామనంబులు, నాత్మ నెఱుఁగునపుడె యణఁగు వేద
 శాస్త్రసంప్రవిధులు శక్తములగావురా, పటు. ౧౬౨

ఆయమేయ కాయఁ డాయనాతిను లేని, మాయ మనము నేమి సేయఁగలదు
 గొడ్డుబోడ్డిబిడ్డకొడుకేమి సేయురా, పటు. ౧౬౩

మానసంబునకును దానైన తనకును, కల్వి మిన్నఁజేని గలదె పుడమి
 మిత్రతిమిరములకు మిత్రత్వముండునా, పటు. ౧౬౪

లేనిమనము రానిపోనిదానిని నంటు, కొనఁగఁగలదె మేలుకొన్ననరుని
 బొంచి కలనదోఁచుపల్లి మ్రింగవచ్చునా, పటు. ౧౬౫

తానఖండసచ్చిదానందరూపకుఁడైన, దనకు మనము గానఁబడదు
 కానఁబడిన నదియుఁ దానయిపోవురా, పటు. ౧౬౬

అగ్గిఁ జేరుతూల మగ్గియైయున్నట్లు, నీటఁ గలియు గుడము నీరమట్లు
 తన్నుఁ జేరుమనము తానయిపోవురా, పటు. ౧౬౭

వెఱ్ఱి సెప్పనేల ఫేనంబు జలము భూ, షణము స్వర్ణమైనసరణి మూన
　సంబు తత్త్వతంబు స్వస్వరూపమ్మురా, ఘటుకా- ౧౬౮

నీట వానచినుకు పాటున బుగ్గయై, నిలిచి నిలువకట్లు నిజముగాను
　గలియుఁ దనకు మనము గలిగి లేకుండురా, ఘటు. (పాఠాంతరము)

అట్లు స్వస్వరూప మంది మనోలయ, మైనధన్యుఁడే సదామనస్క
　పదవిగల సమాధిపరుఁ డని తెలియురా, ఘటు. ౧౬౯

వింటి వినను గనను గంటిఁ బల్కితిఁ బల్కి, పలుక నమను ననెడినపనులను
　దెలియుచుంట బాహ్యదృశ్యసమాధిరా, ఘటు. ౧౭౦

అజుఁడ నవ్యయుఁడ ననాఖ్యుండ నగుణుఁడ, నవిషయుండ నమితి ననెడువృత్తి
　సమితిఁ గనుట బాహ్యశబ్దసమాధిరా, ఘటు ౧౭౧

తలఁచితిని దలంపఁ దెలిసితిఁ దెలియను నెఱుఁగ నెఱుఁగు దని తలంగుమితులఁ
　దెలియుచుంట లోనిదృశ్యసమాధిరా, ఘటు. ౧౭౨

ఆయసంజ్ఞుఁ డాసుఖాతీశసచ్చిత్సు, ఖములఁ దెలిసి వానిఁ గాంచు తెలివి
　పడలకుంట లోనిశబ్దసమాధిరా, ఘటు. ౧౭౩

పడలి బాహ్యదృశ్యశబ్దవృత్తుల నెల్లఁ, దొలఁగఁ ద్రోచి వానిఁ దెలియు తెలివి
　నిలిచియుంట బాహ్యనిర్వికల్పంబురా, ఘటు. ౧౭౪

ఆయఖండవృత్తి నాంతరదృశ్యశ, బ్దాదివృత్తు లణఁచి వానిఁ గాంచు
　నిజము గనుట లోని నిర్వికల్పంబురా, ఘటు. ౧౭౫

తాను సర్వమునను దనయందు సర్వంబు. పరసి పర్వపూర్ణుఁడై వెలుంగు
　జ్ఞప్తి గలిగియుంట జ్ఞాతసమాధిరా, ఘటు. ౧౭౬

బ్రహ్మవిదుఁడ ననెడిభావన గలుగక, బ్రహ్మమైతి ననెడి భావ ముడుగఁ
　దానె యుంట జ్ఞప్తి లేనిసమాధిరా, ఘటు. ౧౭౭

ఈసమాధు లెఱిఁగి యింపెద్దిగానిదైన, బాలుభంగి సుప్తుపగిదిఁ దన్నుఁ
　దా నెఱుంగుచున్న ధన్యుండె ఘనుఁడురా, ఘటు ౧౭౮

అతఁడె బ్రహ్మవిత్తుఁ డతఁడె జీవన్ముక్తుఁ, డతఁడె సాంబశివుఁడు నతఁ డెవిష్ణుఁ
　డతఁడె గురుఁడు ధన్యుఁ డతఁడని యెఱుఁగురా, ఘటు ౧౭౯

ఎఱుకవానితోటి యెఱిఁగినకనుసూటి, నల్లపనులు మీటి యిల్లుదాటి
　చావులేనిచోటి పదివుండు భోగిరా, ఘటు. ౧౮౦

తెలివివానిఁ జేరి తెలిసిన తనదారి, నింటివారి దాఁటి హితవు కోరి
మఱపుదాని మీఱి మను మహాత్ముఁడురా, పటు. ౧౮౧

అంటరానిదాని నంటి తోడగువాని, దంటపూని లోనికంటఁ జూని
యొంటిగానిఁ గూడి యుండు ధీరుఁడురా, పటు. ౧౮౨

దేహమమతలార్చి దేహ్యాహంతయుఁ దీర్చి, సోహమాత్మఁ గూర్చి చూడనేర్చి
యూహ లేనిపదవి నందుముక్తుండురా, పటు. ౧౮౩

బ్రహ్మమును బఠించి బ్రహ్మమునెఱింగి, బ్రహ్మమాచరించి బ్రహ్మ మితిఁగి
బ్రహ్మమైనవాఁడు బ్రాహ్మణోత్తముఁడురా, పటు. ౧౮౪

నీరిలోననుండి నీరంబునంటని, తామరాకుపగిదిఁ దత్త్వవిదుఁడు
సంచరించుకొనుచు సంగి గాకుండురా, పటు. ౧౮౫

అప్పు లిచ్చువాని కప్పులిచ్చునొప్పు, నుప్పరంబు కరణి నున్నవానిఁ
గన్నవాఁడు నిర్వికారుఁడై యుండురా, పటు. ౧౮౬

ప్రత్యగాత్మరూపభావనాపరున కే, వ్వడకయుండు జీవభావమింక
వేషధారి నెఱుఁగ వేషంబు నిలుచునా, పటు. ౧౮౭

అఖిలమాత్మఁ డాత్మఁ డఖిలం బనియెఱుంగు, ఘనున కితర మేమి గానఁబడదు
దారువని యెఱుఁగఁ జోరుండు దోఁచునా, పటు. ౧౮౮

తాళగానగతులు దప్పక తలదూఁచి, బూనఁ జూచునటుని బోలి బుధుఁడు
ఎల్లపనులు గొనుచు నెఱుకతోనుండురా, పటు. ౧౮౯

పరసతీరతుండు బహులార్థిమై దాని, పొందు గోరినట్లు బుధజనుండు
సకలవిధులుగొనుచు సాక్షినే చూచురా, పటు. ౧౯౦

స్వకృతచిత్రపుర మసన్మయం బని కాంచి, మాయికుండు మెలఁగుమాడ్కిఁ దద్జ్ఞుఁ
డాత్మకృత్య మనృత మని చూచి నడచురా, పటు. ౧౯౧

మంటనుండి మంటినంటనికుమ్మర, పురువుభంగిఁ దత్త్వపూర్ణుఁ డఖిల
గుణసమేతుఁడయ్యు గుణరహితుండురా, పటు. ౧౯౨

బ్రహ్మభావనుఁడు ప్రపంచంబు గొనుచుఁ ద, ప్పించుకొనితొలంగుఁ బెరుఁగుదరువ
నడలివచ్చువెన్న చల్లలోఁ గలియునా, పటు. ౧౯౩

నిఖిలమనుభవించి నిష్కల్మషుండైన, యనలునట్లు తద్జ్ఞుఁ డఖిలవిషయ
కాముఁడయ్యు విగతకాముఁడై యుండురా, పటు. ౧౯౪

మోదఖేదవిషయమోహంబు వర్జించి, శత్రుమిత్రులందు సమతగలిగి
సర్వపూర్ణుఁడైన జనుఁడు విజ్ఞానిరా, పటు. ౧౯౫

మేలు గలిగెనేని జాలఁగా మురియక, కీడు గలిగెనేని గినుకపడక
సమత నుండువాఁడె సత్పురుషుండురా, పటు. ౧౯౬

సఖులు సంస్తుతింప సంతోషమొందక, పరులు నిందచేయ బాధపడక
ఆత్మరతుఁడైపో మహానుభావుండురా, పటు. ౧౯౭

గురుకటాక్షదృష్టి గోష్ఠి దీక్షయు గోష్ఠి, దీక్ష లేని మనసు దీక్ష మనసు
దీక్ష లేని తనువు దీక్షఁ దా మోక్షురా, పటు. ౧౯౮

నిఖిలవిషయములను నిఖిలేంద్రియములచే, నెఱుఁగు నెఱుక నెపుడు నేనయనెడి
చిన్మయాత్మరతుఁడు జీవన్ముక్తుండు, పటు ౧౯౯

వెలయ మొదటితనువు విడిచిన బోధజీ, వన్ముక్తి నడిమివపువు విడువఁ
గడశరీర ముడుగ గతదేహముక్తిరా, పటు. ౨౦౦

నిప్పు సోఁకలంటు నింగిని జెదలంటు, ననుట లేనియట్లు నాత్మవిదుని
సుకృతదుష్కృతములు సుడియకయుండురా, పటు ౨౦౧

జ్ఞానవహ్నిఁ గాలు సంచితంబెల్ల నకర్త యగుట భావికర్మముడుగు
బ్రహ్మమైనయపుడె ప్రారబ్ధముడుగురా, పటు. ౨౦౨

ఆత్మదృష్టిలేని యారబ్ధమన్యదృ, ష్టిని గలుగ నేమి సేయఁగలదు
అన్యదృష్టిఁ దోఁచు నహిత్రాడు భ్రమగునా, పటు. ౨౦౩

గురునిపదముఁ బట్టి గురుకటాక్షము వట్టి, గురుపదమ్ము ముట్టి గుఱుతుపట్టి
గురుని గోనఁ గలియ గురుఁడె కేవలుఁడురా, పటుగుణాభిరామ పరశురామ.

ఈద్విపద్యశతము నెవ్వఁడేనియు విను, వ్రాయుఁ జదువుఁ జెప్పువాఁడు తాను
బ్రహ్మమగుచుఁ బరమపదమునందుండురా, పటుగుణాభిరామ పరశురామ.

భూమినొదవి పరశురామపంతులరామ, మూర్తి బ్రహ్మతత్త్వమూర్తులకును
దెలియ రెండుశతకములఁ జేటపటిచెరా, పటుగుణాభిరామ పరశురామ.

---

# కన్నశతకము.

## కందపద్యములు.

అబ్బురపు బాలపదముల, జొబ్బిల్లెడి రస గ్రోల జోకవహింపన్
నిబ్బరపుఁ గవిత లబ్బుట, యబ్బురమా యెఱుకగన్న * యెఱుఁగుడికన్నా. ౧

ఎబ్బెట్టుమతము రోయుచు, నిబ్బరముగ బాలపాదనీరజరసమున్
ఉబ్బుచుఁ గ్రోలినయంతట, నబ్బఁగిని గవితలన్న యెఱుఁగుడికన్నా. ౨

అంజనపుత్రుని కృపచే, రంజిల్లుచు శారదాంబ రసికత మెఱయన్
మంజుళవాక్యము లిచ్చెను, రంజిత బాలాప్రసన్న రవికులకన్నా. 3

మాందర విజయుని కృపగని, యందుపయిన్ యోగివరుని యనుపున (గను)విం
పొందఁగ బుచ్చనగురుదయ, నిందిర నీకబ్బురన్న యెఱుఁగుడికన్నా. ౪

పిల్లలమఱి బుచ్చనగురు, చల్లని వాగమృతఘటన సమరస మొప్పం
గల్ల ప్రపంచము రోసియు, నెల్లప్పుడు నెఱుకగన్న యెఱుఁగుడికన్నా. ౫

బుచ్చనగురుపదవనజము, లచ్చుగ నాహృదయమందు నమరినయపుడే
హెచ్చగు నానందం బిఁక, నచ్చటరా యెఱుకగన్న యెఱుఁగుడికన్నా. ౬

పిల్లలమఱి బుచ్చనగురుఁ, డుల్లము చల్లఁగను జేసియుంచిన యపుడే
తల్లియుఁ దండ్రియు నారలె, యెల్లప్పుడు నెఱుకగన్న యెఱుఁగుడికన్నా. ౭

బుచ్చనగురుఁడే బ్రహ్మము, నిచ్చలముగ వారిపాదనీరజములకున్
సచ్చరితులు పూజించుట, హెచ్చుటరా యెఱుకగన్న యెఱుఁగుడికన్నా. ౮

బుచ్చనగురుపదవనజము, లిచ్చమెయిం బూజసేయ నిహముం బరమున్
ముచ్చటగ నటది నీకిఁక, హెచ్చుటరా యెఱుకగన్న యెఱుఁగుడికన్నా. ౯

సుబ్బయగురుకృపవల్లను, నబ్బెను బాలాంబికగుణ యానందముతో
గొబ్బునఁ గైకొని మనుమీ, యబ్బంగిని నెఱుకగన్న యెఱుఁగుడికన్నా. ౧౦

ఇన్ని దినంబులు గురుపద, మెన్నుచు నీమనసుతోన మెలఁగినయంతన్
జిన్మయసహజానందము, నెన్నఁగ మదిఁ గంటివన్న యెఱుఁగుడికన్నా. ౧౧

ఉంటివి విశ్వము నేనని, కంటివి గురుపాదవనజకోమలరసముం
గంటివి చిద్రూపంబును, నింట స్మది యెఱుకగన్న యెఱుఁగుడికన్నా. ౧౨

---

* ఎఱుగుడియనునది, యెఱుగుడియని సంజ్ఞావాచకముగాన వాడుచున్నాఁడు.

మనసున వృత్తులు నిలిపిన, ననయుంగాఁ దత్త్వగతిని నెఱుఁగఁగవచ్చుం
దను వలయించుట యేటికి, వినవన్నా యెఱుకగన్న విధమునఁ గన్నా. ౧౩

నేత్రము నాసాపుటములు, శ్రోత్రము నొకచోటఁగూడి సుస్థిరమైనం
జా(త్ర) మగునాద మబ్బును, క్షేత్రంబున నెఱుకగన్న శివమగుకన్నా. ౧౪

కన్నులు మూసుక తగనే, తిన్నగఁ దల వంచి మీఁదఁ దిరముగఁ జూడన్
వెన్నెలపోలుపు కనంబడు, నెన్న స్మృతి నెఱుఁకగన్న యెఱుగుడికన్నా. ౧౫

నాసికము మొదలఁ జిత్తము, భాసిల్లఁగ నుంచి చాల భావము గురుపై
నాసక్తితోడ నిలుపుట, యాసుఖమే నీవటన్న యెఱుగుడికన్నా. ౧౬

నాసికము తుదను మొదలను, భాసిల్లుచు నందుమీఁదఁ బైపైఁజూడన్
ఆనచెడి బయలు కనఁబడు, నాసాబగే బ్రహ్మమన్న యెఱుగుడికన్నా. ౧౭

నాసికము రెండుదిక్కుల, మీసము లేకుండఁబట్టి మూసినయంతన్
గాసిని సుషుమ్న గనఁబడు, నాసరణిని నెఱుకగన్న యెఱుగుడికన్నా. ౧౮

కనుగ్రుడ్డు మధ్యబిందువు, పనుపడ నాచుట్టునున్న ప్రభయే పురుషుం
డనుపుగ నీమది నుంచుక, యెనయుర మది యెఱుకగన్న యెఱుగుడికన్నా.

మనసే శక్తియు నిజముగఁ, గనుఁగొని యాశక్తియందుఁ గాలాంతకునిన్
ఎనయించి ముక్తిగనఁదగు, వినవన్నా యెఱుకగన్న విధమునఁ గన్నా. ౨౦

తనయందు ముక్తియుండఁగ, వినయంబుగ గంగ కేగు విధ మేమిటికో
కనవలె విశ్వము మనమని, యెనయఁగ మది నెఱుకగన్న యెఱుగుడికన్నా.

ఎన్నివిధంబుల నైనను, దన్నే తా నెఱుఁగవలయుఁ దలక్రిందైనన్
మిన్నైన మోక్ష మబ్బున, యెన్నఁగ మదియెఱుక గన్న యెఱుగుడికన్నా.

కన్నుల విడుచుట ముక్తియె, యెన్నఁగ మదిలోన నాన యేర్పడకుండం
దిన్నగ విడుచుట ఫల మది, యెన్నఁగ మది నెఱుకగన్న యెఱుగుడికన్నా.

ముక్తిని గనఁబడనిచ్చునె, యత్తుగ నీయందు నహము నానుకయుండన్
ఎత్తుగ దానిని విడువుమ, యిత్తఱి నీవెఱుకగన్న యెఱుగుడికన్నా. ౨౪

తత్తఱపాటులచే మఱి, మత్తిల్లుచు నుండఁగా సుమార్గము గనునా
చిత్తము నిలిచినఁ గనఁబడు, నెత్తుగ మది నెఱుకగన్న యినకులకన్నా. ౨౫

ఎత్తఱి విశ్వము నా దని, పొత్తుగఁ గూడుండినపుడు పోనఁగదు చిత్తం
బొత్తుగ విడువుమ యంతయు, నిత్తఱి మది నెఱుకగన్న యినకులకన్నా.

చిత్తము నే నని యుండకు, తత్తఱపడుదానిఁ గూడి తలఁపుడుగకుమీ
 యుత్తమశాంభవి గనుటది, యెత్తన్నా యెఱుకగన్న యెఱుగుడికన్నా. ౨౭
మత్తేభవృత్తి నుండెడి, చిత్తము గురువంకుసానఁ జిక్కినయపుడే
 నత్తును గనఁబడు నంతట, నెత్తటి మది నెఱుకగన్న యెఱుగుడికన్నా. ౨౮
తత్తఱపడుటది వలదిఁక, గుత్తుకమార్గంబు గాను గోమలిపదముల్
 అత్తుగాన బ్రహ్మతత్త్వం, బెత్తుగ మది యెఱుకగన్న యెఱుగుడికన్నా. ౨౯
భ్రూమధ్యంబునఁ బ్రభ గని, యామీఁదను నెల్లచోట్ల నది భావింపన్
 స్వామి గురుఁ డాత్మ తా నగు, నీమదిచే నెఱుకగన్న యెఱుగుడికన్నా. 3౦
నాసికము తుదను జూడఁగ, భాసిల్లును బ్రభయుఁ జాల ఫాలాగ్రమునన్
 ఆసుఖమునొంది విశ్వము, నీసున దిగనాడవన్న యెఱుగుడికన్నా. 3౧
నాదముపై బిందువు తగ, నాదరమున వాని మీఁద నాపైజ్యోతిన్
 భేదము లేకను గనుటది, యాదిర కృప కెఱుక గన్నయెఱుగుడికన్నా 3౨
ఒడ్డియాణపుబంధం, బుడ్డాడక నిలిచెనని నుపరతి గనురా
 దొడ్డగు మోక్షం బంతట, నడ్డుగు న్నెఱుకగన్న యెఱుగుడికన్నా 33
జాలంధరబంధమ్మును, జాలఁగ బంధించి తేని సహజంబుగనా
 మూలన యుండెడి యమృతముఁ, గ్రోలుదుపుర యెఱుకగన్న గురునతకన్నా
బిందువు నేత్రము మధ్యను, బొందుగఁ గూడుండునట్టి పోఁడిమిగనియా
 పొందునఁ జిత్తము నిల్పిన, నిందిర నీకబ్బురన్న యెఱుగుడికన్నా. 3౫
నాదము వే అని చూడకు, మాదరమున నగ్నియందు నమరిన శిఖయే
 కాదని నీవెంచిన నది, యేదిర మతియెఱుకగన్న యెఱుగుడికన్నా. 3౬
నేత్రంబు కళతొ పురుషుఁడు, సూత్రంబుగఁ జూచినంత సుస్థిరమతి యా
 పాత్రము నీకబ్బినమది, చిత్రంబుగ నెఱుకగన్న శివ మగుకన్నా. 3౭
చిత్తము నిలిచెడి దరుదని, పొత్తుగ నిహమందుఁ గూడి పోనఁగకనీవున్
 ఉత్తమపురుషులఁ గలియుట, యెత్తుర మది యెఱుకగన్న యెఱుగుడికన్నా.
కాయము నిజ మని యెంచకు, మాయను విహరించి చాల మసలకునీవుం
 గోయుమ యరిషడ్వర్గము, నీయనువున నెఱుకకన్న యెఱుగుడికన్నా. 3౯
ఊచుము చిత్తము గురుపై, నెంచుము ఓత్సౌఖ్యమందు నేర్పుఁ దలఁపు
 న్నించుము బ్రహ్మానందము, నెంచిన మది యెఱుకగన్న యెఱుగుడికన్నా.

## (46) హనుమద్దండకము—గ్రం. నం. 176.

వేదపురీనివాసుఁడైన శ్రీయాంజనేయునిపై రచియింపఁబడిన దండకము. కవిపేరు లేదు. దక్షిణదేశప్రతి. తుదనుగూడఁ గవిపేరు లేదు. చాల శిథిలమైనది. కొన్నియాకులు విఱిగిపోయినవి. ఆంజనేయుండు సీతాన్వేషణమునకై బైలుదేఱినది మొదలు యుద్ధకాండము చివరవఱకుఁ గలరామాయణకథయంతయు నీదండకములో వర్ణింపఁబడినది. అక్కడక్కడఁ గొన్నివాక్యములు:—

"శ్రీజానకీనాథ పాదాంబుజధ్యానహృత్సన్నిధానా! నిధానా! సదానంద! సుజ్ఞానపారీణ! వేదాగమజ్ఞానవైభూతి కానేకగంధర్వగానా! ముకున్నందనా! వందనానేకభక్తాభిమానా! సుధాబృందవాక్చాతురీభాసమానా! మనోల్లాసకైలాసవాసప్రియా! యుక్తసద్వీర్య సద్రంజనీయాంజనీగర్భసంజాత సంజీవరాయా! మహారాయ......శ్రీవేదపుర్యాశ్రమావాస! హన్మంతరాయా!......నిన్ను స్మరింపంగ నేనెంతవాఁడ న్సమర్థుండనా యైననా నేర్చినంతం బ్రపంచంబున న్విన్నవింతు న్వినోదంబుగా నీవు త్రేతాయుగంబందు శ్రీరామకార్యార్థమై పార్థివుల్మెచ్చఁగా సంగరంబందు నెంతో ప్రమోదంబునం జెంది బల్వానరానీకము ల్గొల్వఁగా సీత నీక్షింపఁగా వచ్చి............ఎల్లచోటం విచారించి చూచ్చోటనుం గానక............" వ్రాఁత తప్పులు మెండు. మందబుద్ధేమిరా! నన్గూ దయోధ్యాపురం జేలరా! ఇట్టి ప్రయోగములున్నను పదములకూర్పు నియమములు బాగుగానున్నవి. "రాక్షసనామసంవత్సరము, అధికాషాఢ బహుళ చతుర్దశీ శుక్రవారమునాడు వ్రాసిన దీపుస్తకము." అనియున్నదిగాని వ్రాసినవారి పేరుగూడ లేదు. ౧౩ పత్రములుగలవు.

భారతారణ్యములోని "శ్రీకంఠలోకేశ" యనుదండకముగూడఁ గొంత గలదు. మఱియు,

సీ. శృంగారరాయని చెలువుమీఱినకొండ ఫణిరాజుపేరింటి పసిఁడికొండ
పువ్వుజాతులకెల్లఁ బూజింపఁగలకొండ కల్పవృక్షములెల్లఁ గల్గుకొండ
చిలుకలు కోయిలల్చెలఁగి యాడెడుకొండ మృగరాజకోట్లెల్ల మెలఁగుకొండ
ఘోరదురితము వాపు కోనేరుగలకొండ తలఁచిన మోక్షంబు దగులుకొండ
అమరవరులకు వైకుంఠ మైనకొండ, ఆళువారికి బ్రత్యక్షమైనకొండ
యర్థిఁ జూచిన బ్రహ్మాండమైనకొండ, యేరు గనుఁగొంటి శ్రీ వేంకటేశుకొండ.

అనుపద్యమును నామగిరీశునిమీఁది పాటలు కన్యకాష్ఠవారి హెచ్చరికలు మొదలైనవి.

"సీ. హ్రీంకారి హుంకారిహిమశైలకన్యకా అమృతస్వరూపిణి బహుపరాకు
మలయధ్వజునిపుత్త్రి మధురాపురేశ్వరి పరదేశిరక్షకి బహుపరాకు
సౌందరేశ్వరురాణి శాంభవీ జగదంబ భవవిమోచన దుర్గ బహుపరాకు
... ... ... ... ...
అఖిలలోకైకవందితా యాదిశక్తి, పరమకల్యాణి మాయమ్మ బహుపరాకు
పావనంబైనమీపాదపద్మములకు, దేవి మీ నాథుకృపఁజూడు బహుపరాకు."

ఇట్లు కొన్ని తద్భవలలో నున్నవి. సవతులకొట్లాట యని కృష్ణునిగూర్చి యఱవత, తెలుఁగుది, వాదించుట గలదు.

"ఎన్నఁడీపదుమాచ్చిమన్మథక్రీడ యోడీఅతిసప్రసంగమాయి, తెట్టాదడీసొన్నేగా
అబపదాన నాదేవుని చెయిబట్టితే, మాలకూశేవ్రహాతోనువగలాఁడిపోపోవే.
పహామెన్న కాండామెడీ పదుమాచ్చి పంజని కయ్యవేండాం,
మింజాదె మెన్నుడయు రంగసామి తెక్కూని తెంగాగా కలవికయ్యవో.

కూడినగర్వమున, అబపదాన, కాట్లావచ్చితివేమి, ఆడరానిమాట లాడేవు నాతోనుఅవుని చెంపవేతునే॥ చెప్పె యంగిర దెన్నడీ పదుమాచ్చి అతు మాత్రం కొల్లువాయిా కడుకడతు మెత్తగె మింజి వారాదే కన్నత్తుతె యడిప్పేగా."

ఇట్లే రెండుభామలలో సత్తుకుఁగోడలికి సంభాషణ కొంతకలదు.

(47) రంగపురిపారిజాతము. గ్రం. సం. 184.

యక్షగానము- 106 పత్త్రముల పుస్తకము. పుస్తకమువ్రాఁత చాలఁ దప్పులుగా నున్నది.

క. శ్రీరంగపురనివాసుని, సారకృపం బారిజాతసంగ్రహణంబుం
గోరి రచియించినాఁడను, ధారుణిఁ గవిశ్రీనివాసదాసుఁడఁ బ్రేమిగా.

ద్వి. అగణితసౌందర్య లైనట్టిబుధులు,
శేషాంబ శేషార్యశిష్యులరకును; భాషావళీకృపగా బాలుఁడ నగుచు......

అనువాక్యములంబట్టి కవికులగోత్రములు తెలుచున్నవి.
సత్యభామకథ, కృష్ణునికథ, దేవకికథ యిట్లు భాగములుఁ గలవు.

సీ. అమితతిమాలవృతులులార కానరే ఘననీలదేహు నొక్కరుని నిందు
లలితజ్యోతిర్లతావళులార కానరే శ్రీమించు పీతకౌశేయవాసు
విమలమా కమలాకరములార కానరే కళలఁ జెన్నొందు మొగంబువాని
ఆత్తగంధఫలీలతాంతములార కానరే నవమౌక్తికాగ్రనాసంబువాని

అనుచు నాసత్యభామ మదాంధమైన, మోహమొదలోనమతిమతినుమ్మరింప
రంగపురవాసుఁ గానకయుంగథవుని, ధాటిగూకుచు పెదకెనా తరువనములఁ.

(48) సుందరకాండము— గ్రం. నం. 181.

యక్షగానము—శట్టాభిరామకవికృతము. ఈకవికవిత్వము తక్కినయక్షగాన కవులకవిత్వము కంటె నిర్దుష్టముగా నున్నది.

ద్వి. ఇది భక్తరక్షణహితమతిపేర. విదితపూర్ణానందవిభవుని పేర
సదనారతప్రభాసాంద్రుని పేర, సదయుఁడౌ శ్రీరామచంద్రుని పేర
రచియించె నవసుధారసధారలీల, సుచరిత మధురిమస్ఫురణసొంపునను
సూర్యనారాయణసోమయాజికవి, వర్యనందనుఁడైన శట్టాభిరామ
సుకృతి సుందరకాండసుకృతి నాంధ్రమున, సకలజనసుతికిగే సుప్రబంధముగ.

శా. శ్రీసీతాలలితాంగి యంకమున రంజిల్లంగ నంగాంగకే
లానంగంబునఁ జెంగలింపుచును గల్పద్రుస్ఫురచ్ఛాయను
ద్భాసత్ప్రోన్నతరత్నపీఠమున మోదంబొప్పఁగా నున్నయా
కౌసల్యాసుతుఁ డిచ్చు మాకు నెపుడుం గళ్యాణసాకల్యముల్.

అని యిష్టదేవతావందనంబు గావించి శ్రీరామదాసాగ్రేసరుండైన యాంజనేయుని గవి యేతని వినుతింపుచున్నాఁడు.—ఇది ప్రారంభము.

ద్వి. కోటవాకిటిమీఁది కొత్తళంబునకు, గాటంబుగను జివ్వున వేగ దుమికి
వదలించి కట్లు నావలఁ బడఁద్రోచి, మందముఁ దన వాలమున నద్భుతముగ
జ్వలియింపుచున్న యాజ్వాలనుని జూచి, వెలయ నీయగ్నికిఁ బ్రీతిగా లంక
వెలిఁగింతు నని యతివేగంబు మీఱి, నంప్రహాస్తుని యింట నగ్ని రగిల్చి
యింద్రజిత్తుని గృహంబిడి యంగఁదన్ని, సాంద్రంబుగా నగ్ని నమకొల్పి యచట.

ఇది కథాభాగములోని యంశము. పిలవంగనామసంవత్సరం వంగుని 3ల గిరి శెవృడాపట్టి యేర్లగడ్డ వేంకటకుప్పావధానుల కుమారుఁడు రామసుబ్బయ్యశాస్త్రి వ్రాసినది.

(49) బచ్చుపురిమల్లికార్జునశతకము— గ్రం. నం. 206.

స్వప్రకాశశతకమును.

ఈపుస్తకములో దాశరథిశతకము, నరసింహశతకము గూడఁ గలవు. న్ని యుతవము వేదాంతపద్యములు గలవు ధన్యోహం కృష్ణాకృష్ణధన్యోహం, మాభిర్ధన్యోహం. అను సంస్కృతకీర్తనలు గలవు. బచ్చుపురీశ్వర మల్లికార్జున

శతకములో అంబికకు మల్లికార్జునునకును సంభాషణముగా నగపడుచున్నది. "బచ్చపురీశ్వర మల్లికార్జునా" అని యంబిక ప్రార్థింపఁగా "బచ్చపురీశుఁడ నంబికానథ!" యని మల్లికార్జునుని ప్రత్యుత్తరమును గలవు. శృంగారభూయిష్ఠముగానున్నవి.

ఉ. శ్రీరజతాద్రివాస మునిసేవిత మీకు నమస్కరించి నే
నేరిచినట్లు వృత్తములు నెమ్మది రంజిల నూఱుపద్యముల్
కోరికలూరఁ జెప్పెదను గొబ్బునఁ గైకొని శీఘ్రఁబ్రోవఁగా
పాదము మీఁద మ్రొక్కెదను బచ్చపురీశ్వర మల్లికార్జునా' ఇది కవిప్రార్థన.

చ. చల మిఁక మానరా సరసనద్గుణ నిన్నిఁక సన్నుతింతురా
నిలుపరప్రాణ మీమొదల నేరము లెన్నకు మేలుదానరా
బిలిచినఁ బల్కవేమి యిఁకఁ బ్రేమతో చూడర కోర్కి దీర్చరా
పలుమఱు నీకు మ్రొక్కెదను బచ్చపురీశ్వర మల్లికార్జునా.

చ. సరసుఁడ వాడు నిచ్చలియు సారసలోచన ముద్దుగుమ్మరో
విరసము లాడకే యిఁకను వేడుకచేయవె జోడుగూడవే
నిరతము నీమలోకముగ నిండుగ నున్నది ప్రేమ నామదిం
బరమహితుండ నెవ్వరికి బచ్చపురీశుఁడ నంబికానథ.

తొంబదియేడుపద్యములు మాత్రముగలవు కవిపేరు తెలియదు.

స్వప్రకాశశతకము- గీతపద్యములు- "సకలతత్త్వకాశ స్వప్రకాశ" అని మకుటము- మచ్చుచూడుఁడు.

పద్మనేత్రశంభుబ్రహ్మాత్మరూపుల, నొవ్వులవడియూన్వరూపణకముల ?
నతిముదంబుతోడ నతిరాత్రయాజుల,ననవరతము హృదయమందుఁదలఁతు.
పెండ్లికోరువారు పెండ్లాలుగలవారు, యతులు మునులుశూద్రులంగనలును
జ్ఞానమార్గమునకు శ్రవణాధికారులు, సకలతత్వకాశ స్వప్రకాశ. ౨
భాగ్యవంతుఁడైనవాఁడు పోతుముగోరి, యంటనేని వాఁడు మత్తుఁడు
జ్ఞానసాధకుఁ డని శాస్త్రజ్ఞు లంటురు, సకలతత్వకాశ స్వప్రకాశ. 3

వేదాంతమార్గమును బోధించును. ఎనుబదిరెండుపద్యములు మాత్రమే కలవు. కవిపేరు కానరాదు.

(౬౦) నానార్థ సంగ్రహపద్యకావ్యము. గ్రం. సం. 201.

ఇందుఁ బెక్కుపద్యములు నానావిధములవి గలవు. మఃస్పాతికపాలు

భూరిగుణహారి శ్రీబృందపురవిహారి, దితిజకులవైరి కేశవదేవశౌరి-
ముద్దుశ్రీహరి సెలఁగోముద్దుగుమ్మ- బుధజనావన్న వరకూరిపురముచెన్న- రా
జగోపాలుఁ దేవమ్మ రాజవదన- వనితనీవేగి శ్రీవాయులూరిశౌరిఁ, దోడితేవ
మ్మ పోవమ్మ తోయజాక్షి- బళిర వినవయ్య యీబాలప్రౌఢతనము- సరస
మైనట్టి మాటలసత్య మెఱిఁగి, తగవుతీర్చినవాఁడ వో ధర్మరాజ- రార యే
లుకో కోదండరామచంద్ర- విపులకరుణాంతరంగ శ్రీవిజయరంగ, చొక్కనా
థధరాపాల సుగుణలోల. ఇట్టిమకుటములతోఁ గొన్ని పద్యములున్నవి.

ఇందు మొదట బాలసుబ్రహ్మణ్యశతకములోని పది నాల్గుపద్యము లు
న్నవి. ఆపత్రము శిథిలమైనది. కావున వానిని మాత్రమిందుఁ బూర్తిగఁ
జూపుటయైనది.

సీ. శ్రీకంఠవరపుత్ర శృంగారతరగాత్ర సన్మునిస్తుతిపాత్ర జలజనేత్ర
వల్లీమనోహర వాహీకృతమయూర యఖిలలోకాధార యరివిదార
దేవసేనాలోల దివిజసన్నుతశీల కుధరజాబాల సద్గుణవిశాల
భానుకోటిప్రతాప బ్రహ్మణ్యవరరూప యసురసేనాటోప యహితలోప
నీదుపేరిట శతకంబు నేర్చినటులు, విన్నవించెద వినవయ్య వేడ్కమీఱ
శూరసంహార కిటిగిరి సుఖవిహార, సుకవిజనగేయ శ్రీబాలసుబ్బరాయ. ౧

సంతసంబున నిన్ను సంస్మరించుచు భూమి సంచరించెడువాఁడె సజ్జనుండు
నీపదాంభోజముల్ నిర్లజ్జుఁడై సదా భజన చేసెడువాఁడె భాగవతుఁడు
నిర్మలచిత్తుఁడై నిన్ను సేవించుచు ధరనుండువాఁడె వో ధన్యుఁడరయ
సకలచరాచర సంవాసుఁడౌ నిన్నుఁ బూజచేసెడివాఁడె పుణ్యతముఁడు
నీదు లలితంగ నీనామగానరసము, విని సుఖించెడువాఁడె వివేకధనుఁడు. శూ-
ముంచుకోర్వనివాఁడు మూర్ఖుండుఁ గనిగట్లు శ్రీగాంధివట్లు

క్షుద్బాధితుఁడు దివ్యసుధగన్న యట్టులు కడుదరిద్రుఁడు నిధివడసినట్లు
జడమధ్యగతునకు సుడుమ మబ్బినయట్లు ధరఁ దపస్వికి సిద్ధిదొరకినట్లు
తిమిరంబులో మంచి దివ్వెఁ జూచినయట్లు శిశువు తల్లిని జూచి చెలఁగినట్లు
నిన్ను గనుఁగొంటిశుభములు నింపుగంటి, భవదారిద్ర్యభూతంబు పాఱఁగంటి.

పట్టింట(లోనున్న) సవ్యనిక్షేపంబు గానక యాచించువానికరణి
యమృత మపేక్షించి యామదకాంక్షమై వనమూలికల కేగువానిపోల్కిఁ
గల్పకంబును బాసి కాంతారములలోనఁ దుమ్మచెట్లను బోయి నమ్మురీతి
భాగీరథినివీడి పల్వలోదకముల వెతకిగ్రుంకెడు వట్టివెఱ్ఱియా క్షి-

నిన్ను నేమటిమూఢుఁడై యన్యసురులఁ, గొలువఁబోవుట వ్యర్థంబుకువలయమున
దానధర్మములేని ధనరాసు లవియేల భోగింపఁగాలేని పొలఁతి యేల
ఆప్తులు గాకున్న యన్నదమ్ములు నేల దయతోఁదబ్రోవని దైవ మేల
శరణన్నఁ గావని నరపతి బ్రతుకేల సత్యంబు మాలిన సఖ్యమేల
వేదహీనుండైన విప్రుజన్మంబేల తనయులఁ బ్రోవని తల్లియేల
బుధులు పరికించిరిన్నియువృథయటంచు, నిన్నుఁగొల్చినవారెల్ల ధన్యులండ్రు.

కవి యెవ్వరో తెలియదు. కొన్ని సంస్కృతశ్లోకములుగలవు. ప్రాఁతతప్పు
లు మెండుగానున్నవి.

శ్లో. లంకానాథకుహేళికావరిభవః ప్రద్యోతనో జానకీ
వక్షోజద్వయకేళికేళిరసిక స్తావాం రమాకాతర్పితా (?)
సర్వేభ్య స్పదారవిందయుగళీభాజాం నిలింపద్రుమః
శ్రీరామ శ్శివతాతి రస్తు భగవా నామ్నాయ చూడాస్పదః.

(61) దండకములు- చిల్లరపద్యములు- గ్రం. స. 208

(1) నామగిరి దండకము- నామగిరినరసింహస్వామి దేవియైనమహాలక్ష్మిపై దం
డకము- కవిపేరు లేదు. మచ్చునకు-

శ్లో. తారాధీశసహోదరీ భవమహాదారిద్ర్యసంహారిణీ
కారుణ్యాంబుధి సర్వలోకజననీ కల్యాణి కాంతామణీ
చారుశ్రీకరశోభనాంగి వరపంచాస్యప్రియా-
క్షీరాంభోధికుమారి నామగిరిలక్ష్మీ భక్తసంరక్షణీ.

దండకము—శ్రీమన్మహానిత్యకళ్యాణి నీలాంబుభృద్వేణి నీరేజపాణీ బుధశ్రేణి
సంరక్షణీ సైకతశ్రోణి కంజాతసంజాత మాతా జగద్రావ్యాతవిఖ్యాత శశ్వ
ద్గుణోపేత......గర్వకుర్వారుఁడగా నిత్యసర్వావరాధిం గృపంజూడు మా
పంత మావంతలుం దీర్చి నాయొక్కవిజ్ఞాపనాలాపము ల్వింపు లాలించిపా
లించి చేకొఁగదే.........శర్వాణియు న్వాణియుం జామర ల్పట్ట నిం
ద్రాణి కాళాంజి పట్టగా సుపర్వాంగనల్ కూడిగంబుల్ ప్రమోదంబులో
నల్ప...... ఓయమ్మ యవ్వారిగా వారికిప్పింపవే కాళిఁగాళీపురీ వేంక
టాధీశ్వరుం డైన శ్రీమన్నృకంఠీరవస్వామి గారాపుపూఁబోఁడి శ్రీనామ
గిర్యంబ లక్ష్మీజగన్మాత......నమస్తేనమః.

దండకము చివరకుఁజక్కగానున్నది.

(2) ఆర్యాపురీనాథదండకము—కవిపేరు దీనికినిలేదు. మచ్చుచూపెదను.
శ్రీమానినీమానసాంభోజసారంగ సారంగసంగతునా నిత్యకల్యాణ కల్యాణగోత్రేశధీరా సుధీరప్రజాధార విశ్వంభరాకాంత ధారాధరాకార......
ధూళీకృతాక్రూర మారీచదోషాటదోషాటవిప్రాతకంజాతకంజాతనేత్రా అనర్థంబునుగ్రీవ సుగ్రీవమిత్రానుచారిత్ర...ప్రార్థించి నేమ్రొక్కెదన్ మొక్కుచున్ మ్రొక్కుచున్ గ్రక్కున బ్రోవు నావిన్నపం బొక్కటాలింపవే మంచి నీపాదపాథోరుహధ్యాన మెక్కాల మేమూలకన్ నమ్మితి నమ్మితి న్నిమ్ము.....నామాతయున్ ధాతయున్ భ్రాతయు న్నీవె నీవాడ...కృపం బ్రోవుమార్యాస్తుతార్యాపురీనాథుడైనట్టి దేవోత్తమా యుత్తమాంగాచలాధీశ్వరా దేవదేవా నమస్తే.

ఆర్యాపురములో నుత్తమాంగాచలము కలదు కాబోలును, ఆయచలముపై నీస్వామి వెంచేసియుండును. కొన్ని మాటలంబట్టి పైదండకము కదియునొక్కరే రచియించిరా యను సంశయము కలుగుచున్నది.

(3) కామాక్షీదండకము:—శ్రీమన్మహాదేవి శీతాద్రిజాతా జగన్మాత లోకైకవిఖ్యాతదేవాంగనా రాజితాద్రిప్రపాదంబునందుండు మందారకాదంబజంబీర పున్నాగబిల్వాదిభూజంబులుం గల్గు నారామమధ్యంబున న్వజ్రవైడూర్యరత్నావళీ నిర్మితం బైనసన్మంటపంబందు మాణిక్యసింహాసనాసీనుడై యున్న ముక్కంటికి న్వామభాగంబునన్ భద్రపద్మాసనాసీనవై భక్తులం బ్రోచు.........తల్లీ నినుం జూచి సాష్టాంగదండప్రణామంబులం జేసెదన్ నన్నురక్షించు............సర్వలోకేశ్వరుండైన యేకాంబరేశ్వరుంగూడి యున్నట్టి కాంచీపురీనాయకీ......నన్ను రక్షింపవే చాల నాకాలిదోషాంధకారంబునుం బాపు పోచూరి శ్రీకేశవస్వామికిం జెల్లెలైనట్టి యోకాంచి కామాక్షిదేవీ నమస్తే.

ఈకవి పోచూరినివాసియేమో-పేరు తెల్పుకొనలేదు.

(4) సూర్యదండకము:—శ్రీమన్మహాకశ్యపబ్రహ్మపుత్రా పవిత్రా జగన్మిత్ర పూషార్యమిత్రా......సూర్యనారాయణా వేదపారాయణా దేవదేవా నమస్తే నమో,
ఈదండకము క్రొత్తదిగాదు. పలువురు నిత్యమును బఠించునదియే. దీనికిని గవి పేరు తెలియదు.

(౭) చిల్లరపద్యములు:-శాంతాలలామశతకములోనివియు, నల్పు, తెల్పు, పసుపు సీసపద్యములును గలవు.

రామచంద్రునివంటిరాజు తాఁ గల్గెనా పవననందనువంటి బంటుగలఁడు
ధరణి. కృష్ణునివంటి తండ్రి దాఁగల్గెనా కుసుమబాణునివంటి కొడుకుగలఁడు
విక్రమార్కునివంటి పేరుండు గల్గెనా భట్టివంటి యుపాయపరుఁడు గలఁడు
రమణ భోజునివంటి రసికుండు గల్గెనా కాళిదాసునివంటి కవియుఁ గలఁడు
నాఁటివారికిఁ దక్కువే నేటివారు, ఎంతవారికిఁ గలుగుదు రంతవారు
కలఁడు వేయింటికొక్కఁడు కడమలేదు, ఆశ్రితామరయూథ సింహాద్రినాథ.

సీ. ఎలనాఁగ నీదేశ మేదేశ మన్నను జెలువంపు గానొక్క చేరఁజూపెఁ
బద్మాయతాక్షి నీపట్టణం బేదన్న శిలల తటాకంబు పేరఁబలికె
నిందీవరాక్షి నీయిల్లెక్కడన్నను దలవాయి పొంచినతరువు క్రింద
పేటిదానవె కోమ లెఱిఁగింపుమన్నను యేటిలో కొన్నల్లు మొదురుబుచ్చి,
నళినాయతాక్షి నీనామ మేదన్నను తరువాతఁ దినమని తరుణిబలికె
చెలఁది నీకు విభుఁడు గలఁడే యటన్నను, నీళ్ళమీఁదవ్రాసి నలఁతచూపె
నలఁత నీకు నిద్ర గలదెంత యన్నను, చుక్కఁజూపి సుదతి సున్నచుట్టె.

... ... ... ... ...

క. అంబా పూర్ణసుధాకర, బింబానన త్రిజగదతులబిసరుహనయనా
జంభారినుత శ్రీబృహదంబా జగదంబ శ్యామలాంబ ముదంబా.

బృహదంబపైఁ బద్యములు చాలఁగలవు.

భుళిరరవితేజ శ్రీకందివరదరాజ-రమ్యగుణయూథ కావేటిరంగనాథ-చందమామ ... పిలతరిపుఁజేసేవ ముమ్మిలాఁడి- ఇట్లాంత్యనియమములు గల పద్యములు కొన్ని గలవు. నాదబ్రహ్మానందయోగి- పదములు గలవు.

ముక్తిమిచ్చుసి చేత్తాత నిమయాన్ నిమపత్యజ
ప్రమార్గపదయాశౌచసత్యాం పీయూషపద్భుజ

ఇట్లు శ్లోకము లనేకములుగలవు.

ఉ. బూరుగమ్రానియున్నతమఁ బువ్వులుఁ బిందెలుఁ జూచి యాశతోఁ
గీరము లాయునెల్లఁ దమకింపఁగఁ గాచి ఫలాభిలాషియై
చేరి రసంబుగ్రోలఁ గొనఁ జించినదూదియు రేఁగినట్లపో
కూరిమిలేనిరాజులను గొల్చినఁ బెమ్మయసింగధీమణీ.